

# నా యెఱుక

## శ్రీ ఆదిభట్ల నారాయణదాసు స్వీయ చరిత్ర

సంపాదకుడు

**మోదుగుల రవికృష్ణ**

**మిత్రమండలి ప్రచురణలు**

గుంటూరు - 522 004



**NAA YERUKA** (Autobiography)
SRI ADIBHATLA NARAYANDASU

**నా యెఱుక**
శ్రీ ఆదిభట్ల నారాయణదాసు స్వీయచరిత్ర

**సంపాదకుడు**
**మోదుగుల రవికృష్ణ**
తెలుగు లెక్చరర్, ఆర్.వి.ఆర్. విద్యా కళాశాల
గుంటూరు - 6
సెల్ : 9440 320 580

**మిత్రమండలిచే ప్రథమ ముద్రణ**
జులై 2012

వెల : **రూ. 150.00**

**ముఖచిత్రం :** రాయన గిరిధర్ గౌడ్

**టైటిల్ డిజైన్ :** ఎ. గిరిధర్

**డి.టి.పి.**
లక్ష్మీప్రసన్న గ్రాఫిక్స్, డొంకరోడ్, గుంటూరు.
సెల్ : 98660 16690

**ప్రింటర్స్**
శ్రీశ్రీ ప్రింటర్స్, విజయవాడ
9490634849

**ప్రతులకు**

1. **మోదుగుల రవికృష్ణ**
   26-19-10, '0' లైన్,
   మెయిన్‌రోడ్, ఏ.టి. అగ్రహారం
   గుంటూరు - 522 004
   సెల్ : 9440 320 580
2. **నవోదయ బుక్ హౌస్,** కాచిగూడ, హైదరాబాద్
3. **విశాలాంధ్ర బుక్ హౌస్** అన్ని శాఖలు



## శ్రీ గుమ్మడి రాధాకృష్ణమూర్తి

ఆరోగ్యం అంతంత మాత్రం.
ఏమంత భాగ్యశాలి కాదు.
అయినా గుమ్మడిగారి ఘనకార్యాలు
నిజంగా ధన్యకార్యాలు.
మురికికూపాన్ని పవిత్రక్షేత్రంగా మార్చారు.
శ్మశానాన్ని సుందర ఉద్యానవనం చేశారు.
స్వధర్మ సేవా సంస్థతో
ధర్మజ్యోతులను ప్రదీప్తం చేస్తున్నారు.
మనోసంచారం చేస్తున్న
ఇంకా ఎన్నో ప్రణాళికలను
అన్నమయ్య సేవాసమితి ద్వారా
ఆచరణలోకి తెచ్చే అవకాశం కోసం
శ్రమిస్తున్న గుమ్మడిగారికి
శుభాకాంక్షలు.

\- మిత్రమండలి ప్రచురణలు

# విషయసూచిక





# మనవి మాటలు

శ్రీమదజ్జాదాదిభట్ల నారాయణదాసవర్యులు రూపెత్తిన కళావతారం అని అనేకులు రాసిన వ్యాసాలలోనూ, కొంతమంది మహానుభావుల స్వీయచరిత్రలలోనూ చదవడంతో; చిననాటినుండి అలవడిన హరికథా శ్రవణంలో దాసుగారికి జైకొట్టందే కథ ముందుకు కదలక పోవడం గమనించడంతో ఈ దాసుగారి గురించి మరికొంచెం తెలిస్తే బాగుండు అనుకొంటుండేవాడిని. వారు 'నా యెఱుక' పేరుతో రాసిన స్వీయచరిత్ర ప్రచురించబడిందని తెలిసి పుస్తక సంపాదన ప్రయత్నం చేశాను. బాపట్ల, గుంటూరు ప్రభుత్వ గ్రంథాలయాలలో, పఠనాసక్తులైన మిత్రులవద్ద నా ప్రయత్నం ఫలించలేదు. "చిత్రం మహాచిత్రం అనే ఒక కథ ఉండేది". అని మధురవాణి చెప్పినట్టు ఇంత లోకోత్తరపురుషుని కథ దొరకకపోవడం విచిత్రంగా ఉండేది. 1996లో పొటమరించిన కోరిక 2003లో గానీ తీరలేదు.

అప్పటికి అన్నమయ్య గ్రంథాలయం అవతరించలేదు. సేకరించిన గ్రంథసంచయమంతా లంకా సూర్యనారాయణగారి ఇంటిపంచలోనే ఉంది. అడగగా పైకప్పుని తాకే 'గ్రంథగుట్ట'నుండి పుస్తకాన్ని పెళ్లగించి, వారంలోగా వాపస్ చేయాలనే వార్నింగ్‌తో ఇచ్చారు. ఐనా అది నావద్దనే బహువారములు ఉండిపోయింది. పుస్తకం నాకెరుక కాకపోవడమే అందుకు కారణం.

చదివాను. ఒకటికి రెండుతడవలు చదివాను. సంధి జరగగా ఏర్పడిన రూపాలు, వాక్యనిర్మాణక్రమం, సర్వేయర్ గొలుసులోని లింకులులాగా ఒకదానికొకటి పెనవేసుకుపోయిన సుదీర్ఘ వాక్యాలను నేను మొదట్లో అర్థం చేసుకోలేకపోయాను. దీనికి తోడు అలవిమాలిన అచ్చుతప్పులు (ఈ ప్రచురణలోనూ లేవనే గ్యారంటీ ఏమీ లేదు), పదాలమధ్య స్పేసింగ్ సరిగా లేకపోవడం కూడా ఇబ్బందికి దోహదపడింది. కొన్ని మాండలిక పదాలకు అర్థాలు చివరలో ఇచ్చారు కానీ వాటిలో "పిల్లి అంటే మార్జాలం" బాపతువే ఎక్కువగా ఉన్నాయి.

దాసుగారు స్వంత విషయంలో ఎంత బోళాగా వున్నారో ఇతరుల పేర్లను అంత గుంభనగా ఉంచారు. సంఘటనలను సర్వనామాలతోనే సరిపుచ్చారు. "అతడు, ఆ ప్రసిద్ధపురుషుడు, నియోగి పంతులు, శ్రీవైష్ణవుడు, మహారాజా, మునసబు, చిత్రవివాహకర్త" ఇలాంటి సంబోధనలే. ఆ ప్రస్తావించబడిన వారు ప్రసిద్ధ వ్యక్తులని తెలుస్తూనే ఉంది. ఎవరో తెలియదు. మొదటి కన్యాశుల్కం ప్రతిని వివరణలతో బంగోరె ప్రచురించినట్టు 'నా యెఱుక'ను కూడా ఎవరన్నా ప్రచురిస్తే బాగుండు అని అనుకొనేవాణ్ణి. ఇన్నాళ్లకు ఆ అవకాశం అదృష్టం నాకే కలగడం ఏనుగెక్కిన సంబరాన్ని అనుభూతిలోకి తెచ్చింది.

ప్రచురణలో మొదటి సందేహం ఇంటిపేరుతోనే ప్రారంభం. మధునాపంతుల సత్యనారాయణ, దువ్వూరి వేంకటరమణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, యస్వీ జోగారావు

గార్లు ఆదిభట్ట అన్నారు. ఆంధ్రపత్రిక, గుండవరపు లక్ష్మీనారాయణగారు ఆదిభట్ల అన్నారు. చెళ్లపిళ్లవారు అదీఇదీ రెండూ అన్నారు. దాసుగారి హరికథల సంకలనంలో అట్టమీద ఆదిభట్ల అని, లోపల ఆదిభట్ట అని ఉన్నది. దాసుగారు ఒక హరికథకి రాసిన ముందుమాటలో ఆదిభట్ట అని అన్నారు. తెలుగు సంతకంలో ఆదిభట్ట అని, ఇంగ్లీషు సంతకంలో ఆదిభట్ల అని ఉన్నది. నా యెఱుకలో ప్రత్యేకంగా ఇంటిపేరు చెప్పలేదు కానీ ద్విపదలో ఆదిభట్ల అని చెప్పారు. ఈ సంకలనంలో ప్రత్యేకంగా రచయిత రాసినచోట తప్ప (అనుబంధాలలో) మిగతా చోట్ల ఆదిభట్ల అని ప్రయుక్తమైంది. అదీగాక తిప్పాభట్ల, జన్నాభట్ల, పప్పుభొట్ల, త్రిపురారిభట్ల అనే ఇంటిపేర్లే ప్రసిద్ధంగా ఉన్నాయి (కాల్నాథభట్ట అని మినహాయింపు లేకపోలేదు). ఇంటిపేరులో "ట్ట" "ట్ల" ఏది ఉన్నా దాసుగారికి వచ్చిన సేగి ఏమీలేదనుకోండి.

దాసుగారి స్వీయచరిత్రను 1953లో కొంత భాగం, 1955లో మిగిలిన భాగం ఆంధ్రపత్రికలో ప్రకటించారు. 1955లో ప్రచురిస్తున్నప్పుడు ఉపాధ్యాయులవారు అందజేశారని బాక్సులో పేర్కొన్నారు. వీరు దాసుగారి మనుమడు ఉపాధ్యాయులు సూర్యనారాయణగారు అయి వుంటారు. ఆంధ్రపత్రికలో నా యెఱుకను నియమిత కాలవ్యవధులలో ప్రచురించలేదు. రెండురోజులకొకసారి, మూడురోజులకొకసారి ప్రచురించారు. పత్రికలో పెట్టిన శీర్షికలు రాతప్రతిలోనివి కాక పత్రికవారే పెట్టారు అనిపిస్తున్నది. పైగా ఇందులో దాసుగారి అనుభవాలను కాలక్రమంగా కూడా ప్రచురించలేదు.

1976లో యస్వీ జోగారావుగారి సంపాదకత్వంలో కర్రా ఈశ్వరరావుగారు 'నా యెఱుక'ను ప్రచురించారు. ఆంధ్రపత్రికలో కనబడిన కొన్ని అచ్చుతప్పులు యథాతథంగా జోగారావుగారి ప్రతిలోను కనబడటంచేత వారు ఆంధ్రపత్రికలోని ప్రచురణనే మూలంగా తీసుకొని ఉంటారనుకోవాలి. కొన్ని మాండలిక పదాలకు అర్థాలిచ్చారు. అచ్చుతప్పులు, స్పేసింగ్ సమస్య ఇందాకే ప్రస్తావనకొచ్చాయి.

ఈ ప్రచురణలో నాకు తెలిసినంతమటుకు అచ్చుతప్పులు సవరించాను అనుకొంటున్నాను. పరిశీలన, పరిశోధన వంటి పెద్దమాటల జోలికి పోక ఏవో పెద్దల ద్వారా, పుస్తక పఠనం ద్వారా తెలుసుకొన్న కొన్ని వివరణలను పాదసూచికలుగా దాసుగారి పప్పుతో నా పొట్టుకూడా చేర్చాను. కొన్ని ఫోటోలు సమకూర్చాను. అధ్యాయాలుగా విభజించాను. అంతటి మహానుభావుని జన్మస్థలాన్ని సందర్శించాలనే కుతూహలంతో అక్కడేమీ ఉండదని తెలిసికూడా - అజ్జాడ, విజయనగరం ప్రాంతాలు మిత్రులతో కలసి చూసొచ్చాను. అక్షరాలలో ఒదగని డా॥ బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తిగారి సౌజన్యం, ఎన్.కె. బాబు నిర్వహణ చాతుర్యంతో ఇది సాధ్యపడింది.

గాయకుడు దురదృష్టవంతుడేమో! రెండువేల ఏళ్లక్రితం నాటి అజంతా చిత్రాలు అలరిస్తూనే ఉన్నాయి. పన్నెండువందల ఏళ్లనాటి కైలాసగుహ కనువిందు చేస్తూనే ఉంది. వెయ్యేళ్లనాటి నన్నయగారు మహాభారతంలో దర్శనమిస్తూనే ఉన్నాడు. డెబ్బైయేళ్ల క్రితం వరకు

జీవించిఉన్న దాసుగారి కంఠం మనం విననోచలేదు. గ్రామఫోన్ రికార్డుల యుగం ప్రారంభం అయ్యాక ఎంతోమంది మహానుభావుల కంఠాలు రికార్డు చేయబడ్డాయి కదా! దాసుగారి కీర్తి దేశం నలుమూలలా స్వైరవిహారం చేసిందే. వారి హరికథ ఎందుకు రికార్డు కాలేదు! ఈయనే ఇష్టపడలేదా? వారే సంప్రదించలేదా? నాకు ఒక కారణం మనసుకు తట్టింది. దాసుగారి పాటను మైసూరు మహారాజు స్వయంగా రికార్డు చేశాడు. ఆ రికార్డు అగ్నిప్రమాదంలో కాలిపోయింది. సెంటిమెంటుగా భావించి దాసుగారు రికార్డులు ఇవ్వలేదేమో! యు.ఏ. నరసింహమూర్తిగారు మాత్రం తను నలభైయేళ్ల క్రితం మద్రాసు రేడియో స్టేషన్ ప్రసారం చేయగా దాసుగారి కథ విన్నానని గట్టిగా చెబుతున్నారు.

దాసుగారి హరికథ వినడానిక నోచుకోకపోయినా చదవడానికి అందుబాటులో ఉన్నాయి. పదకొండు కథలు చెప్పానని దాసుగారు ఒకచోట రాశారు. 1929లో ప్రచురించిన అంబరీష చరిత్రము ముందుమాటలో "ఇందుతో బది విరచించినాడను" అన్నారు. 1936లో ఒక వ్యాపార ప్రకటనలో సరస్వతీ బుక్‌డిపో వారు ఎనిమిది కథలు కలిపి బౌండ్‌గా 5 రూపాయల 8 అణాలకు కొనవచ్చునని తెలిపారు. సరస్వతీ బుక్‌డిపోవారే 1929 నుండి 1958 వరకు ప్రచురించిన హరికథలు ఏడింటిని కలిపి ఒక బౌండ్‌గా అమ్మారు. దీనిలోని కథలు : 1. శ్రీజానకీశపథము, 2. హరిశ్చంద్రోపాఖ్యానము, 3. భీష్మచరిత్రము, 4. ప్రహ్లాదచరిత్రము, 5. గజేంద్రమోక్షము, 6. అంబరీష చరిత్రము, 7. మార్కండేయచరిత్ర. వ్యాపార ప్రకటనలో ఉన్న రుక్మిణీ కల్యాణం 1958 నాటి బౌండ్‌లో లేదు. ఇవిగాక ధ్రువచరిత్రము, గౌరమ్మపెండ్లి, గోవర్ధనోద్ధరణము, సావిత్రీచరిత్రము, యధార్థరామాయణము అనే తెలుగు హరికథలు, శ్రీహరికథామృతమ్ అనే సంస్కృత హరికథ చెప్పారు. మొత్తం 13 తెలుగు హరికథలు, ఒక సంస్కృత హరికథ. మరి దాసుగారు ద్విపదలో పదకొండే చెప్పానన్నారు. ఆ ద్విపద చెప్పింది మరీ చిన్నవయస్సులో కాదు. డెబ్భైయేళ్ల వయస్సులో.

సరస్వతీ బుక్‌డిపో వారు వేసిన ఏడు హరికథలను చదవగా 'నా యెఱుక' లో శైలికి, హరికథా రచనాశైలికి చాలా తేడా కన్పించింది. పద్యం, పాట చాలా సందర్భాలలో ఎంతో సులభశైలిగా నడిపారు. సాధారణ భాషా జ్ఞానంతోకూడా వాటిని అర్థంచేసుకొని ఆనందించవచ్చు. మళ్లీ మధ్యమధ్యవచ్చే వచనం 'నా యెఱుక' శైలిలో ఉంది. కావ్యాలకు తీసిపోని ఈ హరికథలను కొద్దిపాటి వ్యాఖ్యానంతోనైనా తిరిగి ముద్రించవలసిన అవసరం ఉంది. మరుగునపడిన ఎన్నో అచ్చతెనుగు పదాలు బయటపడతాయి.

భాషాదృష్టితో చూస్తే ఇప్పటి తెలుగు భాషోద్యమకారులకు దాసుగారు 'వేల్పుచెట్టు' వంటివారు. సంస్కృత పదాలను వీలైనంత వర్జించి తెలుగుపదాలకే పట్టం కట్టారు. పేడకళ్లేరడానికి వచ్చిన పిల్లను "కరీషకరండవాహిని" అని పిలిచిన దాసుగారు రక్తాక్షి సంవత్సరాన్ని నెత్తురుకంటి యేడాది అని, శ్రావణమాసాన్ని తూపుచుక్కనెల అని, ఘడియకు కంగు అని రాసేటంతగా శైలిలో మార్పు వచ్చింది. ఈ తేడా వారి వచన రచనలలోనూ కనబడుతుంది.

'నా యెఱుక' కాకుండా దాసుగారివి నాకు తెలిసినంతమటుకు మూడు వ్యాసాలున్నాయి. హరికథ, మంచిబ్రతుకు, సంగీత సాహిత్యోభయ విద్వదాహ్వానము. ఈ మూడు ఆంధ్రపత్రికలో ప్రకటించారు. ఇవికాక అంబరీష చరిత్రముకు రాసిన ముందుమాట. ఒక వ్యాసంకన్నా మరో వ్యాసంలో సంస్కృతంకన్నా తెలుగుదనం పెరుగుతూ వచ్చింది. నాదృష్టిలో మంచిబ్రతుకు, దాసుగారి శతజయంత్యుత్సవ సంచికలో ప్రచురించిన మిన్నికంటి గురునాథశర్మగారి "విరిదోయిలి" అచ్చతెలుగు వచన రచనకు మచ్చుతునకలు. అంటే అదే శైలిని అనుకరించాలని కాదు. అది సాధ్యం కాదు. సంస్కృత భాషా సహాయం లేకుండానే తెలుగుభాషకి భావజాలవ్యక్తీకరణ సామర్థ్యం ఉన్నదని ఆ వ్యాసాల ద్వారా మనం అర్థం చేసుకోవచ్చు.

ఈ గ్రంథ ప్రచురణలో కొద్దిగా ఇబ్బంది పెట్టినది దాసుగారి గురించి వివిధ వ్యక్తులు రాసిన వ్యాసాలలో దొరలిన దొసగులు. 'నా యెఱుక'లో స్పష్టంగా ఉన్న సంగతులుకూడా వ్యాసాలలో మారిపోయి కనబడుతున్నాయి. 'నా యెఱుక' తరువాత సంగతులలో ఒకే సంఘటనను ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా రాయటం కనబడింది. ఆయా సంఘటనలలోని వ్యక్తులను ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా పేర్కొన్నారు. వాటి గురించి యెత్తుకొని సందేహాలు వెలార్చడం ప్రారంభిస్తే తెమలదని సూచనప్రాయంగా చెప్పి విరమిస్తున్నాను. తిరుపతి వేంకటకవులకీ ఈ తిప్పలు తప్పలేదు. చెళ్లపిళ్లగారు బ్రతికుండగానే వారి జీవితంలో జరగనివి కూడా జరిగినట్లు రాస్తుంటే – అవి వారికి గొప్పకలిగించేవే అయినాకూడా ఆయన కలుగజేసుకొని కొన్ని వ్యాసాలలోని సంగతులు చెప్పి అవి జరగలేదని ఎందుకలా రాస్తారని మందలించవలసి వచ్చింది. మచ్చుకి ఒక అంశాన్ని ప్రస్తావించకుండా ఉండలేను.

దాసుగారి మైసూరు ప్రయాణమును ఇలా అంశాలవారీగా చూడవచ్చు.

1. బెంగుళూరులో మైసూరు మహారాజా సమక్షంలో హరికథ చెప్పటం.
2. మైసూరు వెళ్లి కోటలో హరికథ చెప్పటం.
3. దాసుగారి పాటను రాజు రికార్డు చేయటం.
4. కడియాలు, శాలువలు, వెయ్యిరూపాయలు బహుమానం పొందటం.

Mysore as a seat of music (revised and enlarged edition) అనే గ్రంథంలో (రచన – డా॥ఎమ్.బి. వేదవల్లి, చెన్నై) మొదటి సంఘటన చామరాజు–10 కాలంలో జరిగినట్లు, 2, 3, 4, సంఘటనలు చామరాజు కొడుకు, అతని తరవాత రాజు అయిన కృష్ణరాజ వడయర్–4 కాలంలో జరిగినట్లు రాసారు. దాసుగారు 'నా యెఱుక'లో ఇవన్నీ చామరాజే చేశాడని చెప్పినా ఈ పొరపాటు దొర్లింది. పొరపాటు అని తెలుస్తున్నప్పటికి నిర్ధారించుకోవడానికి ఇంచుక శ్రమపడవలసి వచ్చింది. ఒక పొరపాటు ముద్రణలో దొర్లితే దానిని రిఫరెన్సుగా గ్రహించినన్నాళ్లు ఆ పొరపాటు అలా వ్యాపించి నిజంలాగా స్థిరపడిపోయి అసలు సత్యం మరుగునపడుతుందని ప్రత్యేకంగా చెప్పే పనేమున్నది?. దోషప్రకరణం నుండి ఈ ఉదాహరణతో వైదొలగుతాను.

దాసుగారు - గుంటూరు ముచ్చట ఒకటి ప్రస్తావించి తీరాలి. 27-6-1931 నాడు గుంటూరులో జరిగిన ఆంధ్రగాయక మహాసభకు దాసుగారు అధ్యక్షులు. ఆ ఛాయాచిత్రం ఈ పుస్తకం ప్రారంభంలోనే ఉంది. అప్పుడు దాసుగారు బ్రహ్మాండమైన పద్యప్రసంగం చేశారట. అంతకు ముందే ఆంధ్రపత్రికలో దాసుగారు ప్రకటించిన "సంగీత సాహిత్యోభయ విద్వదాహ్వానము"పై హరినాగభూషణంగారు అనే గొప్ప సంగీత విద్వాంసుడు పత్రికలలో విరుచుకుపడ్డారు. క్రమంగా రాతలయుద్ధం వ్యక్తిగత విషయాలు తడమటంలోకి దిగింది. ప్రకటించిన దాసుగారు నిమ్మకు నీరెత్తినట్లు ఇక దానిపై స్పందించలేదు. నాగభూషణం గారు తూలారనే చెప్పాలి. దాసుగారి నాగభూషణంగారి అభిమానవర్గాలు వ్యాసాలతో హోరాహోరీ సంగ్రామం చేశారు. ఈ వర్గాలలో ఉన్నది నస్మరంతులు, లాకాయలూకాయలు కాదు. దిగ్దంతులు. ఇద్దరినీ అమితముగా ఇష్టపడే, గౌరవించే చెళ్లపిళ్లవారు "అనునయము" రాసి ఇరువురిని ఊరుకోబెట్టడానికి ప్రయత్నించారు. నాగభూషణంగారిని తొందరపడ్డావనడం, దాసుగారిని అలాగనడం తగదని, ఇకచాలు ఊరుకో అని "అనునయం"లో మెత్తగా అనడం మనం స్పష్టంగా గమనిస్తాం.

చివరకు గుంటూరులో జరిగిన ఆంధ్రగాయక మహాసభలో గాయకసార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి అధ్యక్షతన ప్రత్యేకంగా ఒక సభ జరిపి నాగభూషణంగారి రాతలను ఖండిస్తూ ఏకగ్రీవ తీర్మానం చేశారు. అప్పటికి గానీ నాగభూషణంగారు దిగివచ్చి దాసుగారికి దాసోహం చెప్పడంతో కథ కంచికి చేరింది. మొత్తం ఈ రగడలో దాసుగారు ఎక్కడా కలగచేసుకోవడం మనం గమనించము. ఓర్పుగా ఊరుకొన్నారు. 'నా యెఱుక'లో దాసుగారు చెప్పుకొన్న తొలినాటి దుందుడుకుతనం తగ్గి వయస్సు వచ్చేకొద్దీ ఎంత తాలిమి నేర్చారో ఈ సంఘటన ద్వారా తెలుస్తుంది.

కొంతమంది దృష్టిలో ఇవి దాసుగారి దోషాలుగా కనబడవచ్చు.

1. నల్లమందు, బ్రాందీ వంటి మత్తుపానీయాలకి చిన్ననాడే అలవాటుపడ్డారు.
2. వేశ్యాగమనం.
3. స్త్రీవిద్య, వితంతువివాహ నిరసన.

దాసుగారు జీవించిఉన్న రోజుల దృష్ట్యా చూస్తే వీటిని వ్యక్తిదోషాలుగా పరిగణించలేము. సమాజంలో ప్రబలంగా ఉన్న దోషాలు కొన్ని వారిని కొంతకాలం ఆవహించాయి. పైగా వాటిలో ఆయన ఆజీవితమూ మగ్నమై పోలేదు. ఇరవైయేళ్ల నుండి అవన్నీ తననుండి తొలగిపోయాయని చెప్పుకొన్నారు.

అప్పట్లో కాశీ తరువాత ప్రశస్తమైన నల్లమందు, గంజాయికి విజయనగరమే పెద్దదిక్కు. రాజుకూడా ఆ వ్యసనానికి లోబడినవాడే. బ్రిటీష్ అధికారులు, వారి కార్యాలయాలు ఉండే ఊళ్లల్లో మేలురకమైన మద్యాలు అందుబాటులో ఉంటాయట. ధనికులు, అధికారులు,

జమీందారులతో నిత్యసహవాసంలో ఉన్న దాసుగారికి - దేన్నైనా సులభంగా తగిలించుకో గలగటం, వదిలించుకోగలగటం సహజప్రకృతిగాగల దాసుగారికి ఈ అలవాట్లు అంటడంలో ఆశ్చర్యం లేదు. ఇక వేశ్యాగమనం. కందుకూరి వీరేశలింగంగారి స్వీయచరిత్ర; వారివి, చిలకమర్తివారివి ప్రహసనాలు, సాక్షి వ్యాసాలు సమాజంలో వేశ్యాలంపటత్వం ఎలా అల్లుకుపోయిందో వైనాలుగా చెప్పారు. దాసుగారి సమకాలీన సమాజంలోని వ్యసనాలు రెండూ ఆయనకి పట్టుబడ్డాయి. గొప్ప ఏమిటంటే ఎంతచిన్నతనంలో వాటిని అలవాటు చేసుకొన్నారో అంత పెందలాడే ఆయన వాటికి ఉద్వాసన చెప్పడం.

స్త్రీవిద్య, వితంతు వివాహ నిరాకరణ గురించి ఇప్పుడుకూడా మనలో వ్యతిరేకభావాలు ఉన్నవారు లేకపోలేదు. పుట్టింది సనాతన సంప్రదాయ కుటుంబం, నేర్చినది పౌరాణికవిద్య. పాతివ్రత్యం అంటే ఎలా ఉండాలో హరికథలలో నిరంతరం చెబుతూ ఉండటం, వితంతువివాహ సమర్థన రెండూ విరుద్ధ అంశాలు. ఎలా పొసగుతాయి. స్త్రీవిద్య ఎలా వుండాలో ఆయన ఊహ వేరు. దేశకాలపాత్రములు అంటారే - ఆదృష్టితో చూస్తే దాసుగారి ప్రవర్తన దూష్యమని నేననుకోను. గురజాడ కన్యాశుల్కంలో ఒక గిరిజనపాత్రనైనా ప్రవేశపెట్టలేదని, శ్రీశ్రీ స్త్రీవాదం, దళితవాదం గురించి ఒక్కముక్కైనా అనలేదని వాపోవడానికి దాసుగారిని తప్పుపట్టడానికి పెద్ద తేడా లేదు. దాసుగారికి ఆంతరికప్రవర్తన బాహిరప్రవర్తన అంటూ రెండూ లేవు. అంతా ఏకబయలు. రాసిక్యంలోనూ వైరాగ్యంలోనూ ఒకే కంఠదఘ్నత ప్రదర్శించగల స్వభావం వారిది.

'నా యెఱుక' కాకుండా దాసుగారి గురించి తెలుసుకోవడానికి ఈ పుస్తకాలు కూడా తోడ్పడతాయి.

1. ఆంధ్ర రచయితలు - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.
2. కథలు గాథలు రెండవభాగం - శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
3. హరికథా పితామహ శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాస శతజయంత్యుత్సవ సంచిక సంస్కృతి సమితి, చీరాలవారి ప్రచురణ.
4. నారాయణ దర్శనం - డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ
5. శ్రీమద్రామాయణ హరికథా గానయజ్ఞం ప్రత్యేక సంచిక (దీనిలో ఎక్కువ వ్యాసాలు శతజయంతి సంచికనుండే తీసుకొన్నారు.)
6. శ్రీ ఆదిభట్ట నారాయణదాసు సారస్వత నీరాజనము - సంపాదకులు యస్వీ జోగారావు
7. నాట్యకళ - ఆదిభట్ట నారాయణదాస ప్రత్యేక సంచిక, ఫిబ్రవరి 1965

చివరలో కొన్ని అనుబంధాలు ఉన్నాయి. మొదటిది 'నా యెఱుక' కాకుండా దాసుగారి వచనానికి ఉదాహరణగా ఉండే హరికథ అనే వ్యాసం. దాసుగారి వంశములో పూర్వులను గురించిన సాక్షి వ్యాసం, చెళ్లపిళ్లవారి వ్యాసభాగం, 'ట'కార ప్రయోగంతో కాకుండా దాసుగారిని ప్రత్యక్షంగా చూసి శంకర శ్రీరామారావు, దువ్వూరివారు చెప్పిన సంగతులు చేర్చాను. దాసుగారు కైలాసవాసులైనప్పుడు ఆంధ్రపత్రికలో ప్రచురించిన స్మృతి చివరి అనుబంధం.

సుమారు రెండేళ్లనుండి ఈ పుస్తక ప్రచురణకు గట్టి ప్రయత్నం చేశాను జీవిత చరిత్రలను వెల్లువగా వేసిన ఒక సంస్థద్వారా, ఇద్దరు మిత్రులద్వారా. అందరూ చిత్తశుద్ధికలవారే. ఒక్కరుకూడా నా ప్రతిపాదనను తిరస్కరించలేదు. అయినా పని జరగలేదు. చివరకు మిత్రమండలి ద్వారా ప్రచురణ సంతోషదాయకం. అవకాశం కలిసివస్తే దాసుగారి అచ్చతెలుగు నిఘంటువు "సీమపల్కువహి" ముద్రించాలనే కోరిక ఉంది.

దాసుగారి పుస్తకానికి కాపీరైట్ అంటూ ఏమీలేదు. దీనిని రాసి నూరో, నూటపదేళ్లో. దాసుగారు యశఃకాయులై అరవైఏడేళ్లు. ఆంధ్రపత్రికలో సీరియల్‌గా ప్రచురించి యాభై నాలుగేళ్లు దాటాయి. అంతకుముందు కొంతభాగం ప్రచురించబడింది గాని పోబడి తెలియలేదు. ఇంతకంటే మంచిరూపంలో ఎవరు ఎప్పుడు ప్రచురించినా సంతోషమే.

డాక్టర్ బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తి, శ్రీ గద్దే మంగయ్య, డాక్టర్ యు.ఏ. నరసింహమూర్తి, డాక్టర్ సిహెచ్.లక్ష్మణచక్రవర్తి, శ్రీ ఎన్.కె. బాబు, శ్రీ అరిశెట్టి సాయిప్రసాద్, శ్రీ శ్రీనివాసుల శ్రీకృష్ణభగవాన్, కేంద్ర సాహిత్య అకాడమీ ఉపసంపాదకురాలు డాక్టర్ తెన్నేటి రాజశ్రీ మీనలోచని, దాసుగారి విద్యౌద్ధత్యం ద్యోతకమయ్యే ముఖచిత్రరచన చేసిన గిరిధర్‌గౌడ్ గారు – ఈ మహానుభావులు కృతజ్ఞతలు ఆశించరుగానీ చెప్పడం వలన నా కృతఘ్నత వెల్లడి కాకుండా ఉంటుంది. వీరందరూ నాయెడల ప్రదర్శించే అభిమానానికి కారణం "వ్యక్తి జన్మాంతర ప్రీతిమ్ మనస్స్ని హృద కారణమ్". అంతకు మించి మరేమీ లేదు. మంజూషికారత్నం గుంటూరు అన్నమయ్య గ్రంథాలయం పరామర్శ గ్రంథాలిచ్చింది.

ఒక ప్రాకృతకవి ఇలా బాధపడ్డాడు.

**దుఖ్ఖం కీరయి కవ్వం**
**కవ్వమ్మి కియే పయుంజాణా దుఖ్ఖం**
**సంతే పయుంజమాణే**
**సోయారో దుల్లహా హెూంతి**

కావ్య రచన దుఃఖంతో కూడుకొన్నది. కావ్యరచన పిమ్మట దాని ప్రయోగం మరీ దుఃఖకరం. ఒకవేళ ప్రయోగించినా శ్రోతలు దుర్లభులు. దీనిలో కావ్యరచన – గ్రంథ ప్రచురణ; కావ్యప్రయోగం – అమ్మకం; శ్రోతలు – పాఠకులు అనుకొన్నాకూడా ఈ గాథ భావం ఇప్పటికీ సరిపోతుంది. ఈ ఇబ్బంది 'నా యెఱుక'కు కలుగదని ఆశిస్తున్నాను. ఈ ప్రచురణలో ఏవైనా దోషాలు దొర్లినట్లు సహృదయ పాఠకులు గమనిస్తే మన్నించమని దోయిలి ఒగ్గుతున్నాను.

నందన ఆషాఢ శుద్ధ అష్టమి భవదీయుడు
27.06.2012, గుంటూరు. **రవికృష్ణ**

# తెలిచిన పుస్తకం

స్వీయచరిత్రలు చరిత్రఖనులు, సాంస్కృతిక నిధులు. మానవాళికి మార్గోపదేశకాలు. మన పూర్వులకు దైవంమీద ఉన్న విశ్వాసం మానవుడిమీద లేని కారణం చేత మహనీయులు సైతం తమ జీవిత విశేషాలను తరువాతి తరాలవారికి కోసం భద్రపరచాలనుకోలేదు. అల్పమైన మానవ జీవన సంగ్రథనం కంటే అనంత కళ్యాణగుణధాముడైన పరమాత్ముని సంకీర్తనమే ప్రధానమని వారికి తోచింది. పాశ్చాత్యుల బుద్ధి ఇందుకు భిన్నమైనది. సమాజ జీవనంలోని ప్రముఖ రంగాలలో అవిశ్రాంతమైన కృషిచేసి అపూర్వమైన అనుభవ పరంపరను తమలో అస్థిగతం చేసుకొన్న మహాపురుషుల జీవితానుభవాలు భావితరాలకు భవ్యోత్సవాన్ని కలిగిస్తాయని వారు భావించారు. తాత్త్వికులు, మహాకవులు, చారిత్రకులు, రాజనీతిజ్ఞులు, కళాకుశలురు – ఇలా వివిధరంగాలకు చెందిన విఖ్యాత పురుషులెందరో తమ జీవితచరిత్రలను రాసుకున్నారు. వారి కోవలో మరికొందరు సామాన్యులు కూడా స్వీయచరిత్ర రచనకు పూనుకొన్నారు. స్వీయచరిత్ర అనే సాహిత్య ప్రక్రియ ఆధునిక యుగంలో బాగా విస్తరించింది. ఆంగ్లవిద్యాభ్యాసంతో భారతీయ సాహిత్యంలో కూడా ఈ ప్రక్రియ పాదం మోపింది.

ఏ భాషలో ఎక్కువ స్వీయచరిత్రలు పుడతాయో ఆ భాష సుసంపన్నమవుతుంది. తెలుగు సాహిత్యానికి ఈ ప్రక్రియను పరిచయం చేసిన ప్రథమ పురుషుడు శ్రీమదాజ్జాద ఆదిభట్ల నారాయణదాసు. ఆ గ్రంథం పేరు 'నా యెఱుక'. ఇది తెలుగులో రాసిన మొదటి స్వీయచరిత్ర. ప్రచురణలో మూడవ స్వీయచరిత్ర. తొలిరోజులలో పత్రికాముఖంగా విడతలు విడతలుగా వెలువడిన దాసుగారి స్వీయచరిత్ర ప్రథమ ముద్రణం 1976 జనవరిలో సంపూర్ణ గ్రంథరూపంగా వెలుగుచూసింది. ఇప్పుడు రవికృష్ణ సంపాదకత్వంలో రెండవకూర్పు వెలువడింది. ఈ రెండుకూర్పులు గుంటూరు పట్టణం నుండే వెలువడటం కాకతాళీయమని కొందరనుకోవచ్చును. గుంటూరు పురవాసులకు నారాయణదాసుగారి పట్లగల విశేషగౌరవాదరాలే, భక్తిప్రపత్తులే అందుకు కారణమని నేననుకుంటాను. మొదటి కూర్పులో నా గురువు ఆచార్య యస్వీ. జోగారావుగారు సంపాదకీయభూమికను సంతరించే అవకాశాన్ని పొందారు. రెండవ కూర్పులో ముందుమాటను అందించే అదృష్టాన్ని నేను దక్కించుకొన్నాను. ఇదీ కాకతాళీయమని నేననను. అటు నా గురువు ఆశీస్సు, ఇటు నా సాహితీమిత్రుడు రవికృష్ణ ఆదరము నాకీ మహద్భాగ్యాన్ని కలిగించాయని నేను విశ్వసిస్తున్నాను. అందుకు వారిద్దరికి ముందుగా మనఃపూర్వకంగా ధన్యవాదాలు సమర్పించుకుంటున్నాను.

వంశకర్త ఆదిభట్టు తరువాత ఆ వంశంలో సుప్రసిద్ధుడు సూర్యనారాయణ. సూర్యనారాయణుని వరప్రసాదంతో పుట్టిన ఆ మహామహుడే తరువాత కాలంలో నారాయణదాసుగా అనశ్వరమైన కీర్తి ప్రతిష్ఠల నార్జించాడు. అంతవరకు వారి వంశం

వారు ఆదిభట్ట అని రాసుకునేవారు. ఆ తరువాత ఆదిభట్ల అని రాయడం ప్రారంభించారు. ఇంకొక విశేషం కూడా ఉంది. తమ ఇంటిపేరుకు ముందు గ్రామనామమైన'అజ్జాడ', పౌరుషబోధకమైన 'శ్రీమత్' శబ్దాలను కూడా చేర్చుకొని 'శ్రీమదజ్జాడాదిభట్ల' అని వ్యవహరించడం కూడా జరిగింది. ఇదంతా కలిపితే దాసుగారి పేరు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసు' అనవలసివస్తుంది. ఈ పరిణామానికి దాసుగారి పౌరుషజ్ఞానకీర్తులు కారణాలని నిస్సంశయంగా చెప్పవచ్చును. సూర్యనారాయణులు 'దాస' శబ్దాన్ని ప్రీతిపాత్రంగా స్వీకరించి తన పేరు చివర చేర్చుకోవడంలో సూరదాసు, పురందరదాసు, కనకదాసు వంటి భక్తసంప్రదాయానికి మహాపురుషుల నామధేయాలు కారణం కావచ్చుననిపిస్తుంది.

దాసుగారు భౌతికంగా రక్తాక్షినామ సంవత్సరంలో జన్మించారు. తైజసంగా ఆయన స్వభానునామ సంవత్సరంలో జన్మించారని చెప్పాలి. కుప్పుసామినాయడను హరిదాసు కానుకుర్తివారి యింట నృత్తగీత వాద్యములతో హరికథను చెప్పడంతో నారాయణదాసుగారి తైజసజీవనానికి బీజవాపం జరిగింది. ఆ ప్రక్రియ లౌకిక జీవనానికి, ఆధ్యాత్మిక జీవనానికి వన్నెకూర్చే ప్రక్రియ అని ఆయన గ్రహించారు. సంప్రదాయ పరంపరాగతమైన దంభాచారాలనన్నింటిని విడిచిపెట్టి సూక్ష్మమార్గంలో తాను తరించి ఇతరులను తరింపజేయడంతోపాటు జీవనసౌఖ్యాన్ని, కీర్తిప్రతిష్ఠలను పొందడంకోసమే తాను పుట్టానని ఆయనలో ఒక అంతర్వాణి పలికింది. కుప్పుసామినాయడు చెప్పినది బీజప్రాయమైన హరికథ. అది మొలకెత్తడం, చిగురుపెట్టడం, శాఖోపశాఖావిలసితమైన మహావృక్షంగా మారడం అంతటికీ నారాయణదాసుగారి ప్రజ్ఞాపాటవాలే మూలశక్తులు. అందుచేత హరికథా ప్రక్రియకు ఆయనే ప్రారంభకుడన్నది నిర్వివాదాంశం. ఈ విధంగా చూసినప్పుడు దాసుగారి శరీరంలో భౌతికము, తైజసము అనే రెండు అంశాలు స్పష్టంగా కనిపిస్తాయి. భౌతిక శరీరము సామాన్య లోకయాత్రాలంపటమైనది. తైజసశరీరము ఈ లోకము మనఃకల్పితమని, పరమసత్యం వేరుగా ఉన్నదని గ్రహించే దివ్యశక్తిమయమైనది. కొందరు దాసుగారి భౌతిక శరీర ధర్మాలనే చూశారు. అనేకులు ఆయనలోని దివ్యశక్తి సంపన్నమైన తైజస శరీర లక్షణాలనే చూసారు. మహాపురుషుల జీవితాలలో విభ్రమాశ్చర్యాలను గొలిపే అద్భుతశక్తులతోపాటు సామాన్య లౌకికధర్మాలైన ప్రలోభాలు కూడా కనిపిస్తాయి. దాసుగారిలో ఈ ప్రలోభాలు బాహిరంగా కనిపిస్తాయి. అటు టాల్‌స్టాయ్, ఇటు శ్రీనాథుడు వంటి మహాపురుషుల జీవితాలను గమనించండి. యౌవ్వనదశలో వారి స్వైరవిహారం, విలాసజీవనం, వ్యసనపరత్వం సారస్వతేయులందరికీ తెలిసినవే.కానీ ఆ కారణాలు వారి కీర్తిప్రతిష్ఠలకు ఆటంకాలుగా నిలవలేదు. నారాయణదాసుగారు అటు టాల్‌స్టాయ్‌తోను, ఇటు శ్రీనాథునితోను పోల్చదగినవారు. పుట్టినది మొదలుగ మూడుపదుల వయసు

దాటేవరకు తన జీవనంలోని, వర్తనంలోని ఏ ఒక్క అంశాన్ని విడిచిపెట్టకుండా నిర్భీతిగా, నిస్సంకోచంగా ఆయన తన స్వీయచరిత్ర అయిన 'నా యెఱుక'లో వెల్లడి చేసారు. తెలుగులో ఎన్నో స్వీయచరిత్రలు వచ్చాయి. కానీ సత్యనిష్టలో దాసుగారి నా యెఱుకతో సాటిరాగల ఇంకొక స్వీయచరిత్ర ఇప్పటికీ పుట్టలేదు. ఇతర భాషలలో ఇటువంటి స్వీయచరిత్రలు ఉన్నాయో లేదో ఆయా భాషలలో పరిశ్రమ చేసినవారు చెప్పదగిన విషయం.

"లోకులచే నేనెఱింగినదియు నా స్వయముగా తెలిసినదియు మదీయానుభూతి దెలుపగోరి యిద్దాని వివరించెద. బాల్యయౌవన దశలను గల యనుభవము, నన్ను గూర్చియు, లోకము గూర్చియు నే దెలిసినమట్టుకు వ్రాసెద" – అంటూ తన ప్రాణమిత్రుడు, తొలిదశలో తన పోషకుడు తనతో కలిసి కవిత్వం చెప్పినవాడు, తన కంచంలోనే భోజనము చేసినవాడు, తానెక్కిన పల్లకి భుజానమోసినవాడు, త్యాగి, భోగి, సంపన్నుడు అయిన జమంతి కామేశం పంతులుతో చెప్తున్న విధంగా 'నా యెఱుక' రచన ప్రారంభించారు దాసుగారు. అజ్జాడ గ్రామంలో ఆదిభట్టవారు సంపన్నులే అయినా దాసుగారి తండ్రి సామాన్యుడు. బహుకుటుంబీకుడు. వేదాధ్యయనంతోపాటు సాహిత్యజ్ఞాన సంపన్నుడు. చక్కటి వ్రాయసకాడు. పేరుప్రఖ్యాతుల నందిన పౌరాణికుడు. కృషికజీవనం కొనసాగించిన వాడు. తల్లిదండ్రులు, తనతో కలిసి ఐదుగురన్నదమ్ములు, నలుగురక్కచెల్లెళ్లు దాసుగారి కుటుంబం. వంతరాం గ్రామస్థులైన మరువాడవారు మాతృవంశీకులు. ఆరుగురు తల్లులు, ఐదుగురు మేనమామలు, అందరూ ఆజానుబాహులు, భీమబలులు, వేదాధ్యయనపరులు, సాహిత్యజ్ఞానసంపన్నులు. దాసుగారిది మేమమామల పోలిక. దాసుగారి తండ్రి సత్యనిష్ఠ గలవాడు, దృఢవ్రతుడు. ఈ లక్షణాలన్నీ దాసుగారికి జన్మతః సంక్రమించాయి.

దాసుగారిలో అసాధారణశక్తులుండేవి. అవన్నీ స్వభావసిద్ధంగా వచ్చినవే కానీ వాటికి గురుశిక్ష అంటూ ఏమీలేదు. ఆడినది ఆటగా, పాడినదిపాటగా ఆయన జీవితమంతా కొనసాగింది. ఆట, పాట, ఆశుధార, అసాధారణ పాండిత్యం, అమితధైర్యం దాసుగారి ఖ్యాతికి కారణాలు. సంగీతము, సాహిత్యము, వేదము వారి కులవిద్యలు. మిగిలినవన్నీ ఆయన అశ్రమంగా నేర్చినవి. ఆయన కడుపునిండా విద్యలే. ఇటు దేశిసంగీతము, అటు మార్గసంగీతము ఆయనకు కొట్టినపిండి. కర్ణాటక సంగీతానికి గంధర్వనగరమైన ఆయన కంఠంలో క్రమక్రమంగా మహావిద్వాంసులకు సైతం లొంగని హిందూస్థానీ పోడుములన్నీ ప్రోగుపడ్డాయి. ఇలా తనకు తెలిసిన సంగీతసర్వస్వాన్నీ సర్కస్‌లో బంతులు విసిరేవాడిలా తన ఇష్టానుసారం మేళవించి ఎక్కడా శాస్త్రానికి లోపం రానీయకుండా తన అపూర్వ సంగీత విద్యావినోదకల్పన చేయడంతో తన సమకాలీనులలో తనకుతానే సాటి అనిపించు కున్నారు. ఇప్పటికీ ఆ గంధర్వ గాయకుడిని అతిశయించిన వారొకరుండరు. ఆ విద్య ఆయనకు దైవదత్తమైనది. ఆ విద్యతో ఆయన మహారాజుల మురిపానకెక్కాడు.

మహావిద్వాంసుల శ్లాఘాశిరఃకంపనకు పాత్రులయ్యారు. లోకోత్తరచరితులయ్యారు. ఆయన పాట యమకింకరులకు కూడా మనసు కరిగించేలా ఉండేది. ఆయనది విద్యకు తగిన రూపము.

"సుందరరూపము దృష్టికి, సంగీతము చెవికి, సువాసన ఘ్రాణమునకు, సుస్పర్శము శరీరమునకు, మంచిచవి జిహ్వకు నభీష్టములు కదా!" అన్నారు దాసుగారు. సాధారణంగా ఇవన్నీ వేరువేరుగా అనుభవించే సుఖాలు. నారాయణదాసుగారి సన్నిధిలో ఈ సుఖాలన్నీ ఒకేసారి అనుభవంలోకి వస్తాయి. తాను మానవ గంధర్వుడనని పరిచయం చేసుకునే అలవాటున్న దాసుగారిలో మానవాంశ, గంధర్వాంశ సమపాళ్లలో మిళితమై ఉన్నాయి. అందుకే ఆయన జీవితంలో లోకసామాన్యమైన తీరు, అలోకసామాన్యమైన అద్భుత శక్తి కనిపిస్తాయి. సాధారణశక్తులు గల మానవులలోను, అసాధారణశక్తులు గల గంధర్వాంశ సంభూతులలోను కూడా తనకాలంలో తనకుతానే సాటి అని అనిపించుకున్న మేటి దాసుగారు. ఉత్తరాంధ్రలో ద్రావిడులకు 'నిమ్మకొయ్యజాతి' అనే ప్రథ ఏర్పడింది. మానవమాత్రులకు తలవంచని వారి ధీరత్వమే అందుకు కారణము. దాసుగారి వ్యక్తిత్వంలో అది ప్రముఖలక్షణంగా కనిపిస్తుంది. సాక్షాత్తు మైసూరు మహారాజావారు తన కొలువు చేయమని అడిగినప్పుడు కూడా దాసుగారు నిశ్చింతగా "విహంగ న్యాయమున బ్రతుక నిశ్చయించితిని గాని యొరుల నౌకరీ సేయు నుద్దేశము నా కెన్నటికిని లేదు. మర్త్యులను గొల్వనొల్లను" – అని బదులిచ్చారు. అయినా ఉదారుడైన ఆ సంగీత సాహిత్యకళాభిజ్ఞుడు దాసుగారిని ప్రథమశ్రేణి సత్కారాలతో ముంచెత్తి ఆయన ప్రతిభాపాటవాలను దేశమంతటికీ వెల్లడిచేశాడు. తనవెంట కలకత్తాకు కూడా రమ్మని ఆహ్వానించిన ఆ మహాప్రభువు అకాలమరణం చెందడం తన దురదృష్టంగా దాసుగారు భావించారు.

దాసుగారు మూర్తీభవించిన ఉత్సాహంగా కనిపించేవారు. ఆయనకు సంగీత సాహిత్య విద్యలు సహజంగా అబ్బాయి. సంస్కృతాంధ్రాలలో ఝురీవేగతుల్యమైన ఆశుధార ఉండేది. ఆయన కవిత్వం కమనీయమైన భావనలతో నిండి ఉండేది. ఆయన ఇంగ్లీషు ధోరణి చికిలీ చేసిన కత్తివలె సాపుగా ఉండేది. అందుకే దేశంలోని ఏ మారుమూల ప్రాంతానికి పోయినా అందరూ ఆనందించేలా వందలకొలదిగా హరికథలు చెప్పగలిగారాయన. అద్భుతమైన శారీరంతో ఏడెనిమిది గంటలపాటు నిరాఘాట సంచారంతో కిన్నెరగానంతో హరికథాకథనం చేసే సందర్భంలో శ్రోతృ సమాజమంతా మైమరచిపోయి చెవులకు విందుగా ఉండే పాటను, కనులకు పండువుగా ఉండే ఆటను అనుభవిస్తూ ఎవరో గంధర్వుడు వచ్చి గానంచేసాడని భావిస్తూ ఉండేది. కన్యాకుమారినుండి కలకత్తా దాకా, అఱవ, కన్నడ, మలయాళ, బెంగాలి, తెలుగుసీమలలో తనకెదురులేకుండా సంచరించారు.

చిన్నగురుని, పెద్దగురుని తప్ప ఇతరులైన గురువులను ఆయన ఎన్నడూ సేవించలేదు. కళావంతులు కాని కాంతలతో కత్తు కలపలేదు. తన శిష్యులను కుమార్తెలతో సమానంగా పరిగణించారు. కళ తప్పిన వారందరను కడుదూరంలో ఉంచారు. ఇరవైయేళ్ల వయసునుండి పరకాంతలను తల్లులుగా భావించారు. తన వర్తనం అపవిత్రమని కొందరు హెచ్చరించినా, మందలించినా ఆయన తన స్వభావాన్ని మార్చుకోలేదు. ఆవంత దాచుకోలేదు. అందుకే ఆయన స్వీయచరిత్ర తెఱచిన పుస్తకమయింది. అంబయే సర్వజగచ్ఛక్తి యును సకలపదార్థప్రకాశికయును త్రిమూర్త్యాత్మికయును ద్రిలింగ రూపిణియును ద్రిగుణసామ్యమును త్రిభువనమూలమును – అన్న మాటలు దాసుగారికి తల్లి పరమ గురువని చెప్తాయి. తనవిగాని, ఇతరులవిగాని తప్పొప్పులు బాహాటంగా వెల్లడించడం ఆయన స్వభావం. పరుల లక్ష్యంగాని, మరి ఏ విధమైన భయంగానీ ఆయన కెన్నడూ లేదు. ఆయన ఏకసంథాగ్రాహి. మూడేళ్ల వయసునుండి వచ్చిన కలలు కూడా ఆయనకు జ్ఞాపకంలో ఉండేవి. అయనకు ముందు చదువు వచ్చింది. ఆ తరువాతనే రాత వచ్చింది. అకారణవైరము, నిష్కారణప్రేమ కొంతవరకు ఆయన విలాసాలు. ఆయనకు ముందుచూపేగాని వెనుకచూపు లేదు. అబద్ధము, మాంసభోజనము ఆయననంటని పాపాలు. "హరికథలతో దుష్టవర్తన ముద్ఘాటించుట, లేని దుఃఖమును బైపెట్టుకొని మిగుల నాయంతటనే బాధపడుచుండుట నాయవివేక చేష్టలు" అని ఆయన స్వయంగా చెప్పుకున్నారు. గురుబోధ కారణంగా అప్పుడప్పుడు మింటి మిద్దెలు కట్టేవారు, ఆకాశంలో పూలు పూయించేవారు.

తన విద్యతో డబ్బు సంపాదించే నేర్పు ఆయనకు ఐదేండ్ల వయసునుండే పట్టుబడింది. "మనుష్యులను మాత్రము తప్ప తక్కిన సర్వలోకము యొక్క చోద్యములను గనిపెట్టుచుంటయును, మనష్యులందరిని నిర్లక్ష్యముగ బరికించుచుంటయును నా శైశవానుభూతులు" – అని చెప్పిన దాసుగారు మనిషిలో తప్ప మిగిలిన జీవజాల మంతటిలోను దైవాన్ని చూసేవారు. మన చుట్టూ ఉండి మనం గమనించని సంగతులెన్నో ఆయన చెప్పేటప్పుడు అబ్బురపాటును కలిగిస్తాయి. పురాణేతిహాసాలలో కనిపించే బలశాలులందరూ దైనందిన జీవితంలో ఆయనతో కలసి మెదలడం మనకు వింత అనిపిస్తుంది. ఆయన పెద్దన్నగారి అతిమానుషబలము, అమానుషచేష్టలు ఇప్పటివారికి వింతగా కనిపిస్తాయి. జీవన సంబంధమైన రాగద్వేషాలతో నిండిన వివిధ భావాల విషయంలో అంటీఅంటకుండా ప్రవర్తించే స్వభావం వారిది. యజ్ఞయాగాల పేరుతో జీవహింస చేయడాన్ని ఆయన తీవ్రంగా ఆక్షేపించారు. ఎక్కడకు వెళ్లినా అల్లరే. ఎక్కడకు వెళ్లినా బహుమానాలే. ఎక్కడకు వెళ్లినా పందాలే. ఎక్కడకు వెళ్లినా గెలుపులే. దాసుగారి జీవితం ఓటమెరుగనిది. సూర్యునికి చీకటి తెలియదు, నారాయణదాసుకు ఓటమి తెలియదు.

ఒడలెరుగని వెర్రినిద్ర ఆయన చిన్నప్పటి గుణం. ఒక పర్యాయం నదీప్రవాహం ముంచెత్తుతున్నప్పుడు కూడా ఆయన నిద్రలోనే ఉన్నారు. ఆయన సత్యవాక్కు. తండ్రి వేసిన వంగనారు పండదంటే పండలేదు. ఏట్లో కొట్టుకుపోయింది. తనను కొట్టవచ్చిన వానిని 'నీ చేతులు విరుగుతాయి' అంటే అతడు పదిరోజులలో పనస చెట్టు పైనుండి పడి రెండు చేతులూ విరగ్గొట్టుకున్నాడు. "ఆయన మ్రింగరాని మిడిగ్రుడ్డు". నిరంతర సంచారంతో కోరినంత సంపాదించినా మిగిల్చినది మాత్రం తక్కువ. ఆయన భోజనప్రియుడు. అనేకుల ఇళ్లలో భోజనం చేశారు. అందరి వంటనూ శ్లాఘించారేకానీ వంక ఎన్నడూ పెట్టలేదు. అన్నం పెట్టిన ప్రతి గృహిణిని తల్లిగా భావించి గౌరవించారు. తననాదరించినవారందరికీ ఏటికోళ్లు పలికారు. స్త్రీ వ్యసనం కింద ఎన్నడూ ఒక దమ్మిడి అయినా ఖర్చుచేయలేదు. ఆటపాటలతో తప్ప ఇంకొక విధంగా డబ్బు సంపాదించలేదు. తన హరికథలను నరులకు అంకితమీయలేదు.

సంస్కృతంలో గొప్ప పండితుడు, కవి అయివుండి కూడా తెలుగంటే ఆయనకు ఎనలేని ప్రేమ. కాలం గడుస్తున్నకొద్దీ తెలుగుమీద ప్రేమతోపాటు సంస్కృతంమీద వ్యతిరేకతకూడా బాగా పెరిగింది. సంస్కృతాన్ని 'కూళ దెయ్యపు కూత' అనడం మాత్రమేకాకుండా 'వేలుపునుడువుల – న్విడనాడవలయు' అని తెలుగువారికి సందేశమిచ్చా రాయన. తన సమకాలికులైన కందుకూరి, గిడుగు, గురజాడల మార్గాలు ఆయనకు సుతరామూ నచ్చలేదు. అందుకే తెలుగులోనే రాసినా గ్రాంథికభాషలో రాసారేకానీ వాడుకభాషలో రాయలేదు. గొప్ప రచయితలనేకులు రాసిన వాడుకభాషకంటే ఆయన రాసిన గ్రాంథికభాషే తేలికగా బోధపడుతుంది. నుడికారపు సొంపు ఉంటుంది. ఆయన స్వీయచరిత్రను ఒక నవల చదివినంత ఆసక్తిగా నిలుపుదల లేకుండా చదవవచ్చును. స్త్రీల విషయంలో ఆయన మనువుకు దగ్గరిచుట్టము. కందుకూరి వీరేశలింగం గారితో ఆయనకు వైషమ్యమేర్పడింది. ఆయన కవిత్వాన్ని, ఉద్యమాన్ని కూడా దాసుగారు హేళన చేసారు. వీరేశలింగం గారి వల్ల దాసుగారికి రెండురకాలుగా హాని జరిగింది. దాసుగారు స్వీయచరిత్ర రాస్తున్న విషయం తెలుసుకొని ఆయనకంటే ముందుగానే తన స్వీయచరిత్రను వీరేశలింగం గారు ప్రచురించారు. దాసుగారు ఈసఫ్‌కథలను 'నూఱుగంటి' అనే పేరుతో పద్యరూపంలో అనువదించారు. ఇది ముద్రణకోసం వీరేశలింగంగారి ముద్రణాలయానికి చేరింది. వీరేశలింగం గారు దాని ప్రచురణను త్రొక్కిపెట్టి ఆ మార్గంలోనే ఈసఫ్‌కథలను తానుకూడా తెనుగు చేసి ముందుగా ప్రకటించారు. అది విద్యార్థులకు పాఠ్యగ్రంథమయింది. ఆ తరువాత దాసుగారి 'నూఱుగంటి' వెలుగు చూసింది. బ్రహ్మసమాజాన్నీ, వితంతు వివాహాలను, మతమార్పిడిని ఆయన వ్యతిరేకించారు. విద్యాధికులందరూ సాయంత్రాలు టౌన్ హాళ్లలో చేసే శుష్కప్రసంగాల వైఖరి వినముచ్చటగా చెప్పారు దాసుగారు. స్వధర్మమే

ఆనుసరించదగినది. పరధర్మము భయావహమైనది అనే వాక్యసారాన్ని దాసుగారు పూర్తిగా విశ్వసించారు.

దాసుగారు స్వేచ్ఛాప్రియులు. విక్టోరియారాణీ పుట్టినరోజు సందర్భంగా ఆమెను పొగుడుతూ పద్యం రాసినా మనదేశం స్వతంత్రం కావాలని ఆయన కాంక్షించారు.స్వతంత్ర దేశానికే పౌరుష జ్ఞానకీర్తులబ్బగలవని ప్రబోధించారు. కాంగ్రెస్, కాంగ్రెస్‌వాదులను మాత్రము సూటిగా ఘాటుగా విమర్శించారు. విదేశీయుల ప్రవేశంతో మనదేశం ఎన్నో విధాల చెడిందో దాసుగారు ఆ వివరమంతా 'నా యెఱుక' లో తెలియజెప్పారు. వ్యవసాయం, వాణిజ్యం అభివృద్ధి పొందినపుడే దేశం అభివృద్ధి చెందుతుందని నొక్కి చెప్పారు. దాసుగారికి బాల్యం నుండే వేదాంతం ముదిరింది. లోకమంతా భ్రమ అని, జీవుడు తామరాకుమీది నీటిబొట్టులా లోకాన్నంటకుండా మసలుతాడని బాల్య, యౌవ్వన, వార్ధకాలలో బాల్యమే శ్రేష్ఠమైన దశ అని దాసుగారు భావించారు. ఆయన వేదాంతధోరణిని 'జగజ్జ్యోతి' అనే బృహద్గ్రంథంలో వెల్లడి చేసారు. వేదాంతంలో కూడా ఆయనది ప్రత్యేక పంథా. వయఃపరిపాకంలో తన అనుభవసర్వస్వాన్ని క్రోడీకరిస్తూ మాదకద్రవ్యాల జోలికి పోవద్దని, స్త్రీవ్యసనానికి లోబడవద్దని దాసుగారు తన తరువాతి తరాలవారికి బోధ చేసారు.

'నా యెఱుక' 19వ శతాబ్ది చతుర్థపాదంలోని దాక్షిణాత్య జీవనసరళికి, సమకాలీన మత సాంఘిక రాజకీయ కళాసంబంధమైన విషయసర్వస్వానికి అద్దం పడుతుంది. మూడు పదుల వయస్సులోపుగా ఆయన ఒరిస్సాలోని రసూల్‌కొండ నుండి కర్ణాటకలోని మైసూరు వరకు గల వివిధ పట్టణాలలోను, పల్లెలలోను కూడా విస్తృతంగా పర్యటించారు. తన అనుభవంలోకి వచ్చిన ప్రతి అంశాన్నీ, తన దృష్టికి ఆనిన ప్రతి దృశ్యాన్నీ, తన నాదరించిన ప్రతి కళాపోషకుడిని, తన చెలిమికాండ్రను, తనతో చదువుకొన్నవారిని, తన గురువులను, తన శత్రువులను ఒకరిని కూడా మరువకుండా, విడవకుండా 'నా యెఱుక'లో ప్రస్తావించారు. గవ్వ, టోలీ, దబ్బు వంటి స్వల్ప ద్రవ్యప్రమాణాలను గూర్చి తెలుసుకోవాలంటే 'నా యెఱుక' చదవాలి. రాత్రనక, పగలనక ఆనాడు క్రోసులకొలది నడక ప్రయాణాల వింతలు విశేషాలు తెలియాలంటే 'నా యెఱుక' చదివి తీరాలి. అజ్జాడ నుండి పూరీజగన్నాథానికి వెళ్లిరావడానికి ఎన్ని నెలలు పట్టేదో, మార్గంలో ఎన్నెన్ని వింతలు ఎదురయ్యేవో తెలుసుకోవాలంటే 'నా యెఱుక' చదవాలి. తన చుట్టూ కనబడే వివిధ జాతుల పక్షులను, పశువులను, క్రిమికీటకాదులను, వృక్షసంతతిని, నదీప్రవాహాలను – ఇలా ప్రకృతిలోని ప్రతి దృశ్యాన్ని దాసుగారు ఎంత నిశితంగా పరిశీలించారో – అటు కాదంబరిని, ఇటు ఆంధ్రమహాభాగవతాన్ని పందెం చరచే రీతిగా కనిపించే సకలర్తువర్ణనను చదివి తీరాలి. విశ్వనాథవారి తెలుగు ఋతువులతో పోల్చదగిన తెలుగుజాతీయత నిండిన వర్ణనలు 'నా యెఱుక'లో కనిపిస్తాయి. బరంపురం, విజయనగరం, బందరు వంటి

పట్టణాలు ఆరోజుల్లో దుర్భర దుర్గంధపూరితాలై, ధూళిదూసరితాలై, అనారోగ్య నిలయాలై ఉండే వైనమంతా తెలుసుకోవాలంటే 'నా యెఱుక' చదవాలి. ఓఢ్ర, తమిళ, ఆంధ్ర, కర్ణాటక దేశాలలోని మనుషుల మాటతీరు, వేషభాషలు, కళాకుశలత ఎలావుండేవో తెలుసుకోవాలంటే 'నా యెఱుక' చదవాలి. తొలినాళ్ల ఆధునికతా పరిచయంతో గ్రామీణుల ప్రతిస్పందన తెలియాలంటే 'నా యెఱుక' చదవాలి. మొదటిసారి చొక్కా తొడుక్కున్నప్పుడు, మొదటిసారి రైలెక్కినప్పుడు అప్పటి జనుల అనుభూతులెలా వుండేవో తెలుసుకోవాలంటే 'నాయెఱుక' చదవాలి. తీరప్రాంతంలోని ఒక ఊరి నుండి ఇంకొక ఊరు వెళ్లడానికి పడవలు, ఓడలు మాత్రమే ప్రయాణసాధనాలుగా ఉండే ఆనాటి ప్రజల అనుభవాలు తెలుసుకోవాలంటే 'నా యెఱుక' చదవాలి. మైసూరు, విజయనగరం సంస్థానాధీశుల ప్రాభవం, ఔదార్యం, సాహిత్య పోషణ, కళాపోషణ కళ్లకు కట్టినట్టు తెలుసుకోవాలంటే 'నా యెఱుక' చదివితీరాలి. ప్రతిభకలవారి పేరు ప్రభువుల చెవిని సోకకుండా ఉండేలా ప్రయత్నాలు చేసే పండితుల అంతర్గత వైషమ్యాలు తెలుసుకోవాలంటే 'నా యెఱుక' చదివి తీరాలి.

నెలకి పుచ్చపూవు వంటి విచ్చపావలా కట్టి కరణపు బడిలో చదువుకొనే రోజులవి. పావలా చేతిలో ఆడని సామాన్యులు పెద్ద చదువులు చదవడానికి ఎటువంటి బాధలు పడవలసి వుండేదో, ఎటువంటి అకార్యకరణానికి సిద్ధపడవలసి వచ్చేదో తెలియాలంటే 'నా యెఱుక' చదవాలి. దాసుగారి బాల్య, యౌవ్వన దశల సంధికాలంలో అధ్యయన రీతులలోను, సంప్రదాయ నిరతిలోను వచ్చిన మార్పులను తెలుసుకోవాలన్నా 'నా యెఱుక' చదవాలి. అనుకూల శత్రువులు, కృత్రిమ స్వభావులు లోకంలో ఎలా మోసాలకు పాల్పడతారో తెలియాలంటే 'నా యెఱుక' చదవాలి. ఉర్లాము ఊరికి నాలుగువైపులా మూడేసి ఫర్లాంగుల దూరం బారులు తీరి కూర్చున్న బ్రాహ్మణ సంతర్పణ భోజన మహోత్సవ దృశ్యం అనుభవంలోకి రావాలన్నా, భూలోక నందనంగా ప్రఖ్యాతిని పొందిన లాల్‌బాగ్‌లోని అత్యంత విశాలమైన ఆవరణలో మైసూరు మహారాజావారు ఏర్పాటు చేసిన వనభోజన దృశ్యం అనుభవంలోకి రావాలన్నా 'నా యెఱుక' చదవవలసిందే. ఒకటి రెండు కాదు దక్షిణాపథంలోని ముప్ఫై ఏళ్ల చారిత్రక, సాంస్కృతిక విషయసర్వస్వానికి 'నాయెఱుక' ఆటపట్టు.

ఆహా! చెల్లనప్పుడు భోగేచ్ఛ మెండుగదా!
రూపాజీవలు శ్మశాన కుసుమము వలే వర్జనీయలు.
కల్లుకిచ్చినట్లు చల్లకీయజాలరు.
పెద్దగురుడు నరికి, చిన్నగురుడు పిరికి.
మదిరాగృహమందు త్రాగుబోతు లన్యోన్యము కన్బర్చు స్నేహమింతింత కాదు.

ఎచటనైనా పాండిత్యమెరిగి సంతోషించువారు కడు నరుదు.
ఆహా! పుణ్యాత్ములకు వారి వారి దోషములగుపడవు కదా!
త్రాగుబోతులయందు మెట్టవేదాంతమును క్షుద్రజనులయెడ దేవతావేశము
తరచుగా గోచరించెదు.

లోకవృత్త పరిశీలనతో కూడిన ఇటువంటి వాక్యాలు 'నా యెఱుక'లోని ప్రతి పుటలోను కనిపిస్తాయి. ఇది అమూల్యమైన గ్రంథం.

'నా యెఱుక' ప్రథమ ముద్రణ ప్రతులు పాఠకులకు ఇప్పుడు అందుబాటులో లేవు. సహృదయ సారస్వతేయులందరూ ఈ గ్రంథ పునర్ముద్రణ కోసం చాలాకాలంగా ఎదురుచూస్తున్నారు. మూడుపదుల వయసుదాటిన తరువాత దాసుగారి వైభవమంతా తెలుగుజాతికి అనేకరూపాలుగా వెల్లడయింది. అందుకే దాసుగారు ఆ వృత్తాంతమంతా విడచి తన బాల్య, యౌవ్వన దశలలోని ఈ విశేషాలను స్వీయచరిత్ర రూపంలో తెలుగు వారికి అందించారు. ఆయన మనఃపూర్వకంగా అందించిన ఈ అమూల్యగ్రంథాన్ని తెలుగు వారందరికీ అందజేయవలసిన బాధ్యతను గుర్తించి రవికృష్ణ దాని పరిష్కృత పాఠాన్ని పునర్ముద్రణగా తీసుకురావడానికి సంసిద్ధులయారు. రవికృష్ణకు సాహిత్యము, చరిత్ర, సంస్కృతి త్రిశరణాలు. అందుకే స్వలాభాపేక్షలేకుండా విశేష వ్యయప్రయాసలకోర్చి క్షోదక్షమమైన పరిశ్రమతో 'నా యెఱుక'లోని విశేషాలన్నింటికీ సప్రమాణమైన వివరణలను చేకూర్చుతూ అందంగా ఆనందంగా ఆహ్లాదజనకంగా ఈ అపూర్వ గ్రంథాన్ని తీర్చిదిద్ది మరీ ప్రకటించారు. అందుకు తెలుగుజాతి వారిని అభినందించాలి. వారి కృషిని ఇనుమడింపజేసే ఉత్తేజాన్నివ్వాలి. నేను ముందుగా మనవి చేసినట్లు ఈ గ్రంథానికి ముందుమాట రాసే అరుదైన అవకాశాన్ని నాకు కల్పించి నన్నొక పెద్దచేసినందుకు రవికృష్ణకి, ఈ గ్రంథప్రకాశకులకు నా మనఃపూర్వకమైన కృతజ్ఞతలను నివేదించు కుంటున్నాను. "చిత్రకారుడాకృతిననుసరించి వ్రాయగలడుగాని చైతన్యము వ్రాయగలడా? కవి శుష్క కల్పనముతో పంచేంద్రియ వ్యాపారము వర్ణించి చెప్పగలడు గాని యాత్మనెల్పగలడా? బ్రహ్మానంద మతీంద్రియమని మాత్రము వర్ణింపశక్యమగును" - దాసుగారి రచన చిత్రానికి చైతన్యం తెప్పించినట్లుంటుంది. కవి వర్ణనకు ఆత్మను మొలిపించినట్లుంటుంది. తన ఆనందానుభూతిని పాఠకులకు పంచిపెట్టినట్లుంటుంది. ఆ పంచిన మంచిని తెలుగువారంతా అనుభవించండి.

ఇట్లు
బుధజనవిధేయుడు
**ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తి**

విజయనగరం
14-6-2012

# నా యెఱుక

## అధ్యాయం - 1

**లో**కులచే నేనెఱింగినదియు నాస్వయముగా తెలిసినదియు మదీయానుభూతి దెలుపగోరి యిద్దాని వివరించెద. బాల్యయౌవన దశలను గల యనుభవము నన్నుగూర్చియు లోకముగూర్చియు నే దెలిసినమట్టుకు వ్రాసెద.

క్రీస్తుశకము 1883 (స్వభాను)లో విజయనగరమున నే మెట్రిక్యులేషను క్లాసులో మహారాజావారి కాలేజీలో[1] చదువుచుండగా కుప్పుస్వామి నాయడనునొక హరిదాసు చెన్నపట్టణము నుండి వచ్చి విజయనగరములో నేనున్న వీధిలో కానుకుర్తివారి యింట[2] ధ్రువచరిత్రము బాడుచు విన్పించిన చిన్న పెద్దలెంతయు సంతోషించిరాయాట, యాతాళముల మ్రోత, యాగజ్జల ఘలుఘల్లా యభినయ మామాటల పొందు సభ్యుల చిత్తరంజకము. శ్రీహరికథ యోట, కేవలము సంగీతము పాడుట కన్నను, ఉపన్యాసము లిచ్చుటకన్నను, నాటకములు, భాగవతములు, బొమ్మలాటలు, మొదలగు వీధినాటకముల కంటె శాస్త్రార్థములకంటెను, సంగీత సాహిత్యము లొక్కచో బ్రయుక్తంబులగుచో నుత్తమ సభారంజకమగునని యెంచితిని. అది వరకు కూర్చుండి పురాణము చదువుట, చేత తాళము పట్టి మద్దెల యొద్ద పాడుట, పల్లవి పాడుచుంట, స్వరోచ్చారణము లేదుగాని కృతులు బాడుటయు గలదు. కవిత్వము నందు ప్రవృత్తి బుట్టెను.

కం॥ **ఖరకరుని కరములను మధుకర ని**

**కరము తేనెపట్టు క్రైవడి గనుడంబర పదము**....... ఇది నా మొదటి పద్యములో కొంత. నాకు హరికథలచే సభను రంజింప గోర్కె పుట్టెను. ఆ రాత్రియే కూర్చుని మూడు పూటలకు చరిత్రయంతయు నల్లినాడను. కొన్ని కీర్తనములొక కవీశ్వరుడు

---

1. **మహారాజావారి కాలేజి** : దీనిని 1857లో విజయనగర సంస్థానాధీశుడు మూడవ విజయరామ గజపతి (1826 - 1879) చిన్న పాఠశాలగా స్థాపించారు. 1868లో ఉన్నత పాఠశాలగా, 1879లో రెండవ తరగతి కళాశాలగా ఎదిగింది. 1910 నాటికి ఈ కళాశాల విద్యార్థుల సంఖ్య 1300. గొప్ప గొప్పవారిని ఏరి కోరి కళాశాల అధ్యక్షులుగా, ఉపన్యాసకులుగా విజయనగరం రాజులు నియమించేవారు.
2. **కానుకుర్తివారి యింట** : విజయగరంలో కానుకుర్తివారు సంపన్నులు, కళాపోషకులు. వీరి యిల్లు వున్న వీధి వీరి పేరుతోనే కానుకుర్తివారి వీధిగా పిలువబడుతున్నది. ఈ వీధిలోనే తదనంతర కాలంలో దాసుగారు యిల్లు కొనుక్కున్నారు. ఈ కథాకాలం నాటికి కానుకుర్తి హనుమంతరావు గారు యింటిపెద్ద.



దాసు గారు మెట్రిక్యులేషన్ చదివిన మహారాజా వారి కళాశాల




దాసు గారు మొదటిగా హరికథ చెప్పిన వేణుగోపాలస్వామి మందిరం

ధన్యుడు విశాఖపురి నివాసుడు ధూళిపాళ కృష్ణయ్య గారు[3] ధ్రువచరిత్రమను యక్షగానమున సొంపుగా చెప్పెను. దానిలోనివి కొన్ని, కొన్ని భాగవతములోని పద్యములును, గొన్ని హితోపదేశమందలి[4] కథలును, గొన్ని ఇంగ్లీషు నందలి కథలును గూర్చినాడ. నా మొదటి కీర్తనము మొదలు - ఖమాచ్ - చతురశ్ర - ఏటికివాని జన్మమేటికే. నాకింగ్లీషు చెప్పించుచున్న మా రెండవయన్న సీతారామయ్య గారి కతనియింట్లో, చిన్నప్పటి నుండి నాతో మిక్కిలి గవగా[5]బాడుచున్న నా నాల్గవయన్న పేరన్నగారు వెనుక పాట పాడుచుండగా విన్పించనాడను. అతడు మిక్కిలి సంతోషించినాడు. మఱి పది దినములకు పేరన్న క్రొత్త కంచు మువ్వలు కూర్పించి కంచు తాళముల జతకూడ నాకొఱకై తెచ్చెను. సీతారామయ్య గారు తన మేడలో నాల్గుగంటల సాయంకాలమున హరికథనము చేసినచో లోకులా నందించెదరని పల్కుచు నా పాదములకు గజ్జెలు కట్టినారు. మొదటి హరికథ శ్రీ వేణు గోపాలస్వామి మందిరమున[6] చిన్నపెద్దలకు విన్పించినాడ. సభ సంతోషించుటచే హెచ్చరిక గొంటిని.

1884 సంవత్సరము డిశంబరులో మెట్రిక్యులేషను పరీక్షకు[7] వెళ్లవలసి వచ్చెను. శ్రీకాకుళమునకు పూడిపెద్ది సోమనాథమను నా క్లాసుమెటొకడు నేనునుబోయి పరీక్షలు వ్రాసినాము. పరీక్షలయిన వెంటనే పేరన్న నాయొద్దకు వచ్చినాడు. తిమ్మరాజు వెంకట్రావు పంతులు గారి యింట్లో కూర్చుండి ధ్రువచరిత్రమును వినిపించినాడను. పేరన్న శ్రుతి వేయుచు వెనుక పాట పాడుచుండెను. మద్దెల యింకొకడు వాయించుచుండెను. తాళములు వాయించుచు కథ వినిపించినాడను. ఆ పంతులు పెద్దసభ చేసి నన్నాదరించి సభలో నన్ను మెచ్చి పది రూప్యములు తాంబూల సహితముగా నాకిచ్చెను.

---

**3. ధూళిపాళ కృష్ణయ్య గారు** : విశాఖపట్టణంలో గోడేవారి ఆశ్రిత కవి. చివరలో వారి ఆశ్రయాన్ని వదిలిపెట్టి పూర్తిగా భగవద్భక్తిలో మునిగిపోయారు. యక్షగానాలతోపాటు భజన కీర్తనలు కూడా రాసారు.

**4. హితోపదేశము** : గద్యపద్యాత్మకమైన సంస్కృత కథామాలిక. కర్త 12వ శతాబ్దంలోని ధవళచంద్రుని ఆస్థానకవి నారాయణ. ఇంతకుమించి రాజు, కవి గురించి ఇతర సమాచారం తెలియదు. ప్రపంచంలోని చాలా దేశాలలో ప్రచారంలో ఉన్న కథాసాహిత్యానికి మూలం హితోపదేశమే. దీనిలో కథలే పంచతంత్రంలో కూడా చేర్పు, మార్పు, కూర్పులతో కనిపిస్తాయి. **5. కవగా** = జంటగా

**6. వేణుగోపాలస్వామి మందిరము** : విజయనగరంలో అయ్యకోనేరు అనే మంచినీటి చెరువుకి పడమటిగట్టున ఉన్నది. మాధ్వుల గుడి.

**7. డిశెంబరులో మెట్రిక్యులేషన్ పరీక్ష** : 1910కి పూర్వం విద్యా సంవత్సరం జనవరి నుంచి డిశెంబరు వరకు. పరీక్షలు డిశెంబరు మొదటివారంలో జరిగేవి. 1910లో విద్యా సంస్కరణలు జరిగి జూన్ నుండి ఏప్రియల్ వరకు విద్యా సంవత్సరం మారింది. అందువలన దాసుగారు 1884 డిశెంబరులో మెట్రిక్యులేషన్ పరీక్ష రాశారు.(చూ. మొదటి కన్యాశుల్కము-ప్రచురణ బంగోరె-ముందుమాటలు-పు.39)

ఆ మరునాడు బయలుదేరి ఉర్లామను[8] గ్రామమున కేగితిమి. అచట కందుకూరు మహాలక్ష్మమ్మ[9] గారు మైనరుగానున్నారు. లింగము వేంకటరావు పంతులు గారు మేనేజరుగా నున్నారు. అతడు కవిత్వము సొగసుగా జెప్పగలడు. ప్రొప్రైటిక్సు గారి యింటియొద్ద నాచే బాడించి పది రూపాయలిచ్చెను. పిదప నరసన్నపేటలో నొక సబ్ మేజిస్ట్రేటు పాడించి పది రూపాయలిచ్చెను. పిమ్మట టెక్కలి రఘునాథపురము[10]లో నొకపంతులు పాడించి అయిదు రూపాయలిచ్చెను. పిదప బరంపురము[11] వెళ్లినాము. అచట నాకు స్వయము పెదతల్లి కుమారుడు మరువాడ జగన్నాథము పంతులు జిల్లా కోర్టు ప్లీడరుగా నున్నాడు. పుస్తకము గిరగిర త్రిప్పుచు శరవేగమున గీర్వాణాంధ్రములు చదువుట – ఒక్కసారి వినిన మాత్రమున గీర్వాణాంధ్రాంగ్లేయ పద్యముల మఱల జదువుట– కోరిన తాళములు బల్లవి పాడుట– పెక్కు రాగములాలాపించుట– గీర్వాణాంధ్రములన్నానా వృత్తములలో గవిత్వము చెప్పుట – అష్టావధాన మొనర్చుట – అపూర్వ కల్పనముగా నాంధ్రాంగ్లేయ భాషలతో వేలకొలది జనులుగల సభల పాడుచు నుపన్యసించుటయు నా విద్యలు. విద్యలందు గురుశిక్ష మిక్కిలి తక్కువ గాని స్వభావముగా నాకు జొరవయెక్కువ. నేనాడినదాట పాడినది పాటగా జనులు సంతోషపడుట నాయెడల దైవానుగ్రహము. నేనైదేండ్ల మొదలుకొని గీర్వాణాంధ్రములు శరవేగమున జదువ నేర్పు గలవాడను. నాకు లోకజ్ఞానము బొత్తిగా సున్నయనియు, డబ్బు విలువ యేమియును దెలియదనియు వర్తన మపవిత్రమనియు నాయందు ప్రేమ గలవారు పలుసార్లు నన్ను మందలించుచు వచ్చినప్పటికి నా స్వభావము మాఱకుండెను.

---

**8. ఉర్లాము** : శ్రీకాకుళము జిల్లాలో నర్సన్నపేట మండలములోని గ్రామము. చిన్న జమీ అయినా పండితులను ఆదరించడంలో పేరుమోసింది. వేదవిద్యకు ఉర్లాము సంస్థానము ఇచ్చిన చేయూత ఇంత అని చెప్పరానిది. ఇక్కడ శ్రావణమాసంలో జరిగే వేద పరీక్షలలో సత్కారం పొందినవాడు అంటే జగజ్జెట్టి అని అర్థం.

**9. కందుకూరి మహాలక్ష్మమ్మ** : ఉర్లాము జమీందారులలో ప్రసిద్ధుడైన కందుకూరి బసవరాజుగారి కోడలు. భర్త చాలా చిన్న వయసులో చనిపోగా తాను పిన్నవయస్కురాలయ్యి కూడా మేనేజర్ లింగము వేంకటరావు పంతులు సహకారంతో జమీని సమర్థవంతంగా పరిపాలించారు.

**10. టెక్కలి రఘునాథపురము** : శ్రీకాకుళం జిల్లాలో మండల కేంద్రం. టెక్కలి ఒరియా పేరు. అసలు పదం టికలి. అంటే స్త్రీకి అరణంగా ఇచ్చే కానుక. ఓఢ్ర గజపతులలో ఒకరు తమ ఆడపడుచుకి పసుపు కుంకుమ క్రింద ఇచ్చిన ఊరు. అందుకే ఆ పేరు. టెక్కలి చిన్న జమీ. పరిపాలించిన వారిలో ప్రసిద్ధుడైన రఘునాథ దేవ్ పేరుతో రఘునాథపురం అయ్యింది. జనం పాత కొత్త పేర్లను కలిపి టెక్కలి రఘునాథపురంగా వ్యవహరించేవారు.

**11. బరంపురము** : ప్రాచీననామం బ్రహ్మపురము. ఇంగ్లీషు వారి ఉచ్చారణలో బెర్హాంపూర్ అయ్యింది. ఒడిశా రాష్ట్రంలో జిల్లా కేంద్రం. తెలుగుతనం నిండుగా ఉన్న పరరాష్ట్రపు ఊళ్లల్లో ఇదీ ఒకటి.

నన్ను జూచినతోడనే మాయన్న జగన్నాథము పంతులు నాతో "తమ్ముడా! జనరంజకమైన యెన్ని విద్యలు నీయందు కలిసి యున్నవో"యని బ్రహ్మానందమగపర్చి నా శిరము ముద్దాడెను. అపుడతనితో "అన్నా! నా చదువునేమి చూచెదవు, నా హరికథ చిత్తగింపుము. నీకు మరింత సంతోషము కలుగును" అని యంటిని. ఆ పిదప నతడు నాళము భీమరాజు[12]తో నన్ను గూర్చి చెప్పెను. భీమరాజు తన యింట నాచే హరికథ చేయించెను. రెండుమూడువేల జనులు సభలో నుండిరి. సాయంకాలము నాలుగు గంటలకు ధ్రువచరిత్రము ప్రారంభించి రాత్రి పది వఱకు చెప్పినాడను. ఆనాడే కాళ్లకు గజ్జలు కట్టుకొని నృత్యము చేయుచు హరికథ యొనర్చుటకు మొదలు. ఆ భీమరాజు హరికథ ముగిసినతోడనే సభలో నాకు నూటపదారు రూపాయలు నొక పట్టుపంచల చాపును బహుమతి చేసెను.

అయిదేండ్ల వయసు నుండియు బురాణము చదివి లయజ్ఞానముతో బాడి యితరులను సంతోషపెట్టి డబ్బు సంపాదించు నేర్పు నాకు గలదు.

భీమరాజుగారి యింట నే హరికథ ముగించిన వెంటనే సభలో నే కుప్పుస్వామి నాయడు విజయనగరములో హరికథ చేయగా విని నేను హరికథ చేయ బూనుకొంటినినో యా కుప్పుస్వామినాయడు నాకు సాష్టాంగపడి మ్రొక్కి నాతో "అయ్యా! మీరెప్పటి నుండి హరికథ చేయుచున్నారు?" అని యడిగెను. అందుకు నేను "కుప్పుస్వామి నాయ డనునొక మీ పోలిక మనుష్యుడు విజయనగరములో హరికథ చెప్పగా విన్న మొదలుకొని హరికథ చేయబూనుకొంటిని" అని చెప్పగా నతడు చిరునవ్వు నవ్వి "నేనే యా కుప్పుస్వామి నయ్యా. నీవు బ్రాహ్మణోత్తముడవు. విద్య నీ సొమ్ము. నీవు చిన్నవాడు. మాట యింకను నిల్కడగా జెప్పవలయును. రేపు నేను దేవరపేట[13]లో హరికథ చేసెదను. వినుము" అని పల్కెను. ఆ మఱునాడతని కథ వింటిని. అతడు సంగీతమందు గాని సాహిత్యమందు గాని గొప్ప విద్వాంసుడు గాడు గాని కొంత లయజ్ఞానముతో సభారంజనముగా పాడి మాటలు చెప్పగలవాడు. ఆ హరిదాసాయూరనుండి కథకొక యవతారమెత్తు చున్నాడు. అచట టికెట్టు సిస్టముపై మఱొక కథ చేసినాను. నా టిక్కెట్లకు నలుబది రూప్యములు దొరికియుండెను.

---

**12. నాళము భీమరాజు** : బరంపురంలో న్యాయవాది. కళాపోషకుడు. వ్యాపారంకూడా చేసేవాడు. జయంతి కామేశంగారి కీర్తి ముందు ఇతడు గణనకు రాలేదు కానీ ఆరోజులలో భీమరాజుగారి ఇల్లు కూడా నిరతాన్నదానానికి ప్రసిద్ధి.

**13. దేవరపేట** : బరంపురం పట్టణంలో ఒక పేట.

పిమ్మట జయంతి కామేశముపంతులు[14] యింటికి వెళ్లి, యతనిని జూచినాడను. అతడు చేయెత్తు పొడవగు రూపసి, లోకోత్తరుడు. భాగవతోత్తముడు, గొప్ప పండితుడు, కవి, హైకోర్టు వకీలు. పదిలక్షల రూపాయలకుబైగా నార్జించిన త్యాగభోగరాయడు. నాయెఱింగిన వారిలో నంత రసికుడు మఱియు నంత యుదార పురుషుడు నింకొకడు లేడు. ఒక మేడపై నా పుణ్యాత్ముడు పందిరి కోళ్ల మంచముపై కూర్చుండి యాంధ్ర భాగవతము చదివించుచు వినుచున్నాడు. నన్నుజూచిన తోడనే "కస్త్వమ్‌కుతో஽సి"[15] అని ప్రశ్నింపగా "మానవగంధర్వావయం విజయనగరీతః"[16] అని చెప్పగా పంతులు నిదానించి నడివయసు సింగమువలె నొసట వ్రేలాడు నుంగరముల పేర్లు ముంగురులు. సటలుగా వెన్నెలలు గొల్పు చిరునగు మోమున దొఱల విస్మితుడయ్యెను. నాకు రెండు గజముల దూరముగా దెఱవబడి చదువబడుచున్న భాగవతములోని శరదృతు వచనము నా చదువుచున్న వాని నా పుటమును జేతుల నతిత్వరితముగా నలుముచుండుమని యతడట్లు చేయగా శరవేగమున ననేక రాగలయ తాళములతో లఘు గురునియమము తప్పక చదువుటకు కామేశము పంతులద్భుతామోదములగపర్చి "దృష్టం దృష్టవ్యం శ్రుతం శ్రోతవ్యమ్"[17] అని నన్ను సత్కరింపగా మేముభయులము తివాచీ మీద గూర్చుంటి మంతట నా మేడయొద్ద గడయెక్కి విద్దెలు చేయుచొక్క యొడ్డెవీటిసాని గడపై నుండి "యద్ధాత్రా నిజఫాలపట్ట లిఖితం స్తోకం మహద్వాధనం, తత్ప్రాప్నోతి"[18] యను శ్లోకమును సంపూర్ణముగా దారస్థాయిని జదువునపుడా పంతులు కంటనీరు పెట్టుకొని తన మొలన్నంగరు గొలుసు కొననున్న తాళముతో జెంగటి దంతపుపెట్టె తెఱచి పదిరూప్యములా వీటిసాని కిచ్చెను.

---

14. **జయంతి కామేశం** : బరంపురంలో చాలా వైభవంగా జీవించారు. వీరి జీవితచరిత్రలో కొన్ని విచిత్ర సంఘటనలను కామేశంగారి సహపాఠి పనప్పాకం అనంతాచార్యులు ముఖతా విని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రికార్డు చేసిపెట్టారు. (శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిలో వ్యాసమంజరి సంపుటం. పు. 242 – 245) 15. **కస్త్వమ్.....** : నువ్వు ఎక్కడి వాడవు?

16. **మానవ.....** : విజయనగర వాసులమైన మేము మానవరూప గంధర్వులము.

17. **దృష్టం....** : చూసిన దానినే చెప్పాలి. చెప్పినదానినే వినాలి.

18. **యద్ధాత్రా....**: యద్ధాత్రా నిజఫాలపట్ట లిఖితం స్తోకం మహద్వా ధనం
తత్ప్రాప్నోతి మరుస్థలే஽పి నితరం మేరౌచ నోత్కధికం
తద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః
కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలం

(తన నొసట రాసివున్న సొమ్ము కొద్దో గొప్పో ఎడారిలో ఉన్నా లభిస్తుంది. స్వర్ణమయమైన మేరుపర్వతం వద్ద ఉన్నా అంతకంటే ఎక్కువ లభించదు. కనుక ధనవంతులను చూచి దీనత్వాన్ని ప్రదర్శించవద్దు. కుండను బావిలో ముంచినా సముద్రంలో ముంచినా లభించేది కుండెడు నీళ్లే. ప్రాప్తమెంతో అంతే పొందగలము. ఇది భర్తృహరి నీతిశతకం దుర్జనపద్ధతిలో 40వ శ్లోకం.)

పిదప సాయంకాలమైదు గంటల సమయమునకు కుప్పుసామినాయడను హరిదాసు పంతులు యొద్దకురాగా నతడు నాతో 'అయ్యా! ఈ నాయడు గొప్ప హరిదాసితని వలన నాలుగు హరికథలు వింటిని. మిగుల సభారంజనముగా హరికథ వినిపించును" అనెనందుకు నాయడతనితో నన్నగపర్చి "ఈ మహానుభావుని యెదుట హనుమంతుని ముందు కుప్పిగంతులన్నట్లుండును నా పని. ఇదివఱకు వీరి కథ మీరు చిత్తగించలేదు కాబోలును" అనగా పంతులు నాతో "మీరు హరికథ కూడా చెప్పగలరా? ఏది యెట్లు చెప్పెదరో నేటిరాత్రి యిచటనే భోజన మొనర్చి హరికథ చెప్పవలయును" అనెను.

నేను తొమ్మిదిగంటల రాత్రి ధ్రువచరిత్ర చెప్పుటకై పరీక్షిన్మహారాజునకు శాపము కలుగుట యా మహారాజునకు శుకమహర్షి భాగవతముపదేశించు కారణము వివరించుచు నుపోద్ఘాత మొంటిగంట రాత్రి వఱకును బిమ్మట ధ్రువ చరిత్రముదయ మేడుగంటల వఱకును జెప్పినాడ. రెండువేలకు బైగా పిన్న పెద్దలందరు సావధానముగా నాలించుచుండిరి. సభ మేడ వరండా క్రింద జరిగెను. మృదంగ సాహాయ్యమున బేరన్న ఫిడేలు శ్రుతి వేయుచు వెనుక పాటపాడగా నాడుచు బాడు చాశుధారావైచిత్ర్య మగపర్చుచు మంగళము పాడినాను. ధ్రువుని భక్తి మెచ్చి తాబరవశుడై యానందబాష్పములు రాల్చుచు ఎత్తిన నడ్డి వంచక, చుట్ట కాల్చుకొనుటకైన లేవక నా హరికథ తుదముట్ట విని, పంతులు సభలో లేచి నిలువబడి "సంగీత విద్యను గూర్చి నాకు మిక్కిలి తెలియదు గాని యీతని పాటయు చదువును నృత్యమును మిక్కిలి మనోహరము లితని కవితాశక్తి యపారమితడు కథ ప్రారంభించి ముగించు నందాక నేబొందిన యానందమునకు మేరలేదు" అని చెప్పి నాతో "అయ్యా! రెండు నెలల వఱకు నా యొద్ద నుండుము. నీ పెండ్లికి దగినంత ద్రవ్యము నీకిచ్చెద"ననెను. నా పెదతల్లి కొడుకు జగన్నాథము పంతులా సభలో "తమ్ముడా! కామేశము పంతులు గారంతవారు నిన్ను మెచ్చినా రిక లోక ప్రసిద్ధుడ వైతివి" అని సంతోషపడెను.

జయంతి కామేశము పంతులు వెలనాటి వైదిక బ్రాహ్మణుడు. నా తొమ్మిదేండ్ల వయసున నేను పేరన్న మా తలిదండ్రులు శ్రీజగన్నాథయాత్రకు బోవునపుడు బరంపురము కోర్టుపేటలో నీ జయంతి కామేశము పంతులు గారి యింట సత్రములో దిగినాము. మా తండ్రిగారీ పంతులు పైని సంస్కృతమున నుపజాత్యష్టకము[19] చెప్పినారు. మా యుభయుల

**19. ఉపజాత్యష్టకం :** ఉపజాతి అంటే ఇంద్రవ్రజ, ఉపేంద్రవ్రజ, పృథ్వీ, తోటకం వంటి సంస్కృత ఛందస్సులు; వీటిలో ఏదో ఛందస్సులో చెప్పిన 8 పద్యాలు. తెలుగులో ఆటవెలది, తేటగీతి, సీసం, కందం వంటివి ఉపజాతి ఛందస్సులు.

సూరయ్యపంతులు చిన్నకిమిడి దివాను. పట్టుపురములో నవరాత్రులు చేయుచున్నాడు. రాత్రి యేకభుక్తముగా నవరాత్రులు గడిపినాము. మాతండ్రికి నాలుగురూపాయలు మా యిద్దరికి చెరియొక రూపాయి యిచ్చినాడు. అచట నుండి సేరుగడాకు వెళ్లినా మాదారిలో మాతండ్రియు బేరన్నయును ముందు నడుచుచున్నాడు, మాయమ్మయు నేనును వెన్క నడుచుచున్నాము. కథలు చెప్పుచు, వింతవింత భవిష్యద్వార్తలు చెప్పుచు, మా తల్లికి మార్గాయాసము మరపించువాడును. "అమ్మా! ఇంకముందు మనమిట్లు కష్టపడి కాలినడకతో బోవనక్కరలేదు. ఎడ్లుగాని పోతులు గాని కట్టకుండ నిరువది ముప్పది పెట్టెబండ్లు యంత్రములచే నడిపెదరట. శ్రీకాకుళము నుండి యిక్కడికి యొకగంటకు రావచ్చునట. ఒకడు బండిపై కూర్చుని కాళ్లాడించిన మాత్రమున నాబండి యిష్టము వచ్చినట్లెల్ల పరుగిడునట. విమాన మెక్కి మనుష్య లాకాసమున దిరిగెరట" యని యద్భుతములు చెప్పుచు మాయమ్మను నడిపించుచుండవాడను. మాకన్న మాతండ్రియు బేరన్నయు రెండు ఫర్లాంగులు ముందైనారు. అడవిదారి ఒకచోట పట్టెదాట వేసి యున్నారు దొంగలు. వాండ్రు తమలోదాము దెబ్బలాడుచు, నేపందెము గెలిచెనో చూడుమని మాయమ్మను తగవడిగిరి, ఆమె మెడలో దీగె చూచిరి. గాన వాండ్రా మిషపై మమ్ములను మాతండ్రికి దూరము సేయుటకై యెంచిరి. మాయమ్మ సత్యకాలపుది. ఆ యాటచూచి వీడు గెల్చినాడు వాడోడినాడని తగవు[8] చెప్పుచున్నది. ముందేగుచున్న బలశాలి నా తండ్రి వెనుక దిరిగి చూచి "యుందుడుండుడు. నేను బందెమొడ్డెద"నని యా పచ్చెపువాండ్ర నదలించి, యినుప పొన్నులున్న తన చేతి వెదురు దుడ్డెత్తి పరుగిడిరాగా, నా పచ్చెపువాండ్రు, నాతల్లి నవ్వుకొనునట్లు పటాపంచలై పరుగిడిరి. ఉదయము జాము ప్రొద్దునకు సేరుగడా చేరితిమి. అది మన్యము, చిన్న కొండయేరు దాని చెంత బారుచున్నది. వోఢ్రము తప్ప తెలుగు మాటలేదు. పసపునూనె పట్టించుకొని స్త్రీలు పురుషులు మురికిదుక్కబట్టలతో స్నానములు చేయుచుండుటయు వారికి బట్టెదేసి గుండుజోళ్లు చెవులకుంటయు నాశ్చర్య మయ్యెను. ఆ యూళ్లో మా సన్నిహిత బంధువు మరువాడ వెంకయ్య గారు మూడు దినములు మమ్మాదరించి రెండు రూపాయలు మాతండ్రికిచ్చి పంపిరి.

బరంపురమునకు బిదప వచ్చితిమి. బరంపురమునందువలె నతిథి సత్కార మింకొక చోట జరుగుట నేను చూడలేదు. అంత సౌకర్యమైన భోజన మింకొకయెడ దొరకదు. అచటి గృహస్థులందరు నన్నదాతలే. ప్రతి గృహమునం దొకడో, యిద్దరో, ముగ్గురో, నలుగురో యతిథులుండువారు. ఆ యూర దిగుమర్తివారి యింట విడిసిన నా యన్నదాత మాకు షడ్రసోపేతముగా భోజనము పెట్టి, నారాత్రి అతని సావిడిలో పడుకొన్నపుడు

8. తగవు : న్యాయము, తీర్పు.

టక్కు టిక్కుమని మ్రోగు గడియారమును జూచి, నా తల్లితో నా తండ్రి "చూచితివా! టక్కు టిక్కు ధ్వనులతో కాలములపోక చెప్పు నీ జంత్రమువంటిదే యాయుఃక్షయ ముచ్ఛ్వాస నిశ్వాసముల దెల్పు నిద్దేహము. ఆహా! కాలము జరుగుట కనిపెట్టినట్లు రానున్న కాలమును దెలిసికొనరాదుగదా?" యని పల్కెను. అచట అయిదారు రూపాయల వరకు సంపాదించి యసికాకు వెళ్లి, యట మూడు పూటలుండి రసూల్కొండకు వెళ్లినాము. ఆ చిన్నపట్టణమొక గుట్ట చుట్టుకొని దబ్బకాయ చుట్ల వంటి వీధులతో రమ్యముగా నున్నది. అద్దానికి దక్షిణముగా వంతెనతో నొక చిన్న తీయనీటియేరు పారుచున్నది. ఆ కొండ మీద సంపెంగ చెట్ల నడుమ నాంగ్లేయపాఠశాలయును, వైద్యశాలయును, పురరక్షక భటాధ్యక్షాయుధ శాలయును గలవు. చిన్నతాలూకా ప్రదేశములలో రసూల్కొండ వంటి యందమైన స్థలము లేదు. అచట మాయమ్మ కన్న పెద్ద యాపె మా పెదతల్లియున్నది. ఆమె భర్త మరువాడ తమ్మయ్య గారు. వధూవరులిద్దరు పండుముసలి వారు. మమ్ములనెంతయో యాదరించిరి. ఒక నాడచటి శిక్షణాధికారాధ్యక్షుడగు బచ్చు నరసింహస్వామి పంతులు గారి యింటికి మా యమ్మయు మేమిద్దరన్నదమ్ములము వెళ్లినాము. ఆ పంతుల భార్య తెల్లగ లావుగనున్నది. నేను భాగవతము చదివినాను. మాయమ్మ యర్థము చెప్పిన, దందుకు సంతోషించి యా యిల్లాలు మా యమ్మకు రెండు రూపాయలును క్రొత్త చీరయును మా యిద్దరికి చెరియొక మాతులుంగ ఫలమును[9] దయచేసెను, తిరిగి యసికామీదుగ బరంపురమునకు వచ్చినాము.



**యౌవ్వనంలో గేరా తలకట్టుతో దాసుగారు**

---

**9. మాతులుంగఫలము :** మాదీఫలం. ఆయుర్వేద ఔషధాల తయారీలో ఉపయోగించే నిమ్మజాతి ఫలం. వీటి లభ్యత తగ్గటంతో బదులుగా నిమ్మకాయ వాడుతున్నారట.

# అధ్యాయం - 3

**కో**ర్టుపేటలో నోవదాన్యశిరోమణీ! బ్రహ్మకులమండనా! జయంతి వంశ పారావార సుధాకరా! సకల విద్వజ్జనవిధేయా! కామేశాభిధేయా! చిత్తగించుము.

నీ యింట రెండుపూటలును షడ్రసోపేతముగా ములగకాడలు, వంకాయ ముక్కలు, లంకజీడి పళ్లానప కాయబద్దలు వైదికులకు; నుల్లిపాయలతో లౌకికులను బ్రత్యేకముగా బ్రశస్తముగా గాచబడిన పప్పు పులుసును, వివిధ శాకములు, బక్ష్యాన్నములు వెలయ వందలకొలది బ్రాహ్మణులతో గలిసి నెల పదేను దినములు హాయిగానుండి, మీ యొద్ద నా తండ్రి "శెలవు దయచేయుడు, శ్రీజగన్నాథము సేవింపనేగెద" ననగా "శాస్త్రి గారూ! తిరుగుదలలో నన్ను జూడుడు. నా శక్తికొలది మిమ్ముల సత్కరించెదను" అను నీ పల్కులు నా కర్ణామృతములయ్యెను.

## ఛత్రపురమున

పిమ్మట మేము ఛత్రపురమునకు వెళ్లి కొద్దిరోజులచట నాగితిమి. ఆయూర ముప్పది నలుబది రూప్యముల వరకు మాకు వైదిక సంపాదనముగా లభించెను. ఆ చెంగటి గంజామున నొక యింట నొక రేయి గడిపి తెల్లవారిన పిదప శ్రీజగన్నాథము వైపు నడువ సాగితిమి. మూడు నాల్గు క్రోసులు నడిచి, పదునొకండు ఘడియల ప్రొద్దున కొక యొద్దె పల్లె చెరువు కడ, నాయూరి యొక పుణ్యాత్ముడిచ్చిన సీదా[1] తెచ్చుకొని వండుకొని భుజించితిమి. ఆ చెరువు నీరెర్రగా జలగ నెత్తురు వలె నుంట నా యెర్ర బియ్యమునకు మరింత యెర్రరంగువెట్టెను. "ఆకలి చవి తెలియదను సామెత మనయెడ నెంత నిజమయ్యెను'' అను మా తల్లి మాట యచ్చెరువు కావించెను. అటనుండి సాయంకాలమునకు జిలక సముద్రపు పడమటి యొద్దుననున్న రంభయను గ్రామమునకు జేరుకొంటిమి. రంభ సత్రములో నారేయి గడిపి మరునా డుదయము పదునొకొండు గంటలకు రుచ్యముగా వంకాయ ముద్దయును పప్పును జిక్కని పెరుగుతో హాయిగా భోజనము చేసికొని, మిక్కిలి యుత్సాహముతో జిలకసముద్రపుటొడ్డునందలి యోడరేవులకు బోయి మానల్గుర కించుమించు పది రూప్యములు సుంకము చెల్లించి, యొక పడవలో గూరుచుండి, మేమిల్లు విడిచినది మొదలు జరిగిన వృత్తాంతములు చెప్పుకొనుచు, మమ్మాదరించిన పుణ్యాత్ముల న్గొనియాడుకొనుచు, శ్రీజగన్నాథస్వామి సేవ దొరుకును జన్మ సాఫల్యమగునని యుప్పొంగుచు మా కుటుంబమందలి తక్కినవారిగూర్చి తలంచు

1. **సీదా** : స్వయంపాకపు సామాగ్రి. సదావృత్తి అసలుపదం. ఆంధ్రపత్రికలోను, జోగారావుగారి ప్రతిలోను సీదా అని వున్నది. బహుశా సదావృత్తికి హ్రస్వరూపం 'సదా' అయివుంటుంది.

కొనుచు, చిలకసముద్రము నభివర్ణించుచు, శ్రీజగన్నాథవతారమును గూర్చి మా తండ్రి చెప్పగ వినుచు, శ్రీజగన్నాథ క్షేత్ర వృత్తాంతమును రంభ నుండి మమ్ము శ్రీజగన్నాథమునకు దోడ్కొని పోవు పండాలు విన్పించగా భక్తిశ్రద్ధలతో నాలించుచు, నప్పుడప్పుడు నీటిపై నుండి యగపడు పెద్ద పెద్ద తాబేళ్లు మొదలగు జల జంతువుల గ్గని యబ్బురపడుచు, నడురేయియం "దిద్ది మిక్కిలి సంకట స్థలము పడవలకు ప్రమాదకరమైనది. శ్రీజగన్నాథా! పతితపావనా! కాపాడుము గాపాడుమని యాత్రికులందఱు న్దేవుని భజించుకొండ"ను నావికుల యుపదేశమును విని భయభక్తులతో శ్రీజగన్నాథుని స్మరించుకొనుచు, యాకలి బడలిక, భయములచే బట్టీబట్టని నిద్దురతో, నారేయి తెల్లవారగా సేమముగా నరసింహ ఘట్టము[2] సమీపమున నోడలు దిగి యొడ్డు చేరుకొంటిమి.

## శ్రీ జగన్నాథస్వామి సందర్శనము

రెండుమూడు క్రోసులమేర నిసుకదిబ్బలపై నడిచి, నరసింహ ఘట్టమునందు ముమ్మరముగా రాలిన గచ్చకాయలు కావలసినన్ని యేరుకొని, శ్రీజగన్నాథాలయ స్వర్ణశిఖరము న్గాంచి మ్రొక్కుచు "జయ జగన్నాథా" యని భగవన్నామోచ్చారణ పరవశు లమై, దూరమార్గగమన శ్రమమంతయు న్మరచి, పదిగంటల ప్రొద్దునకు శ్రీజగన్నాథము దేవాలయము చెంత సీతగుండము దరి మమ్ము దోడ్కొని వచ్చిన పండాలగపర్చిన యింట దిగి, యాకుండికయందలి యాకుపచ్చని చిక్కని మురికి నీట బున్నెముకై ముక్కుమూసికొని మునిగినాము. ఇప్పుడు కోటి రూపాయిలిచ్చినను అంత మురికి పసరునీటిలో గాలైన పెట్టుదునా? ఇప్పుడు భక్తి చెడి, వేదాంతము ముదిరెను గదా! ఆ బూరగా ళ్లాబుడ్డలా వీధులలోని మురిగినయన్నము కంపాగుండములోని కుళ్లునీ రచటి పండావాంఛ దురాశయు నిర్దాక్షిణ్యము చెప్పనలవి కాదు. భక్తి మూర్తీభవించినట్లు కోవెలకు బోయి, జగన్నాథుడు, బలరాముడు, నడుమ సుభద్ర యనెడు మూడు విగ్రహములను దర్శించి, మ్రొక్కి తోచిన దక్షిణ సమర్పించుకొని, యొక చిన్నకుండప్రసాదము, నువ్వకాయపులుసును కొని బసకు వచ్చి భక్షించినాము. సాయంకాలము నాలుగుగంటల కూరుచూచుటకు బయలుదేరినాము. మా యమ్మ యొకయర్ధణా యిచ్చి రెండు కుంభాళప్పములు కొని మా యిద్దరన్నదమ్ములకు జెరియొకటి జేత బెట్టెను. నాయప్పము నే దినుచుండగ నొకగ్రద్ద తన్నుకొనిపోయెను. శ్రీజగన్నాథ ధ్వజమగు గరుడమూర్తి సాక్షాత్తుగా స్వీకరించెనని అప్పము పోయినందుకు ఖిన్నుడనగు నన్ను నా తండ్రి యోదార్చెను. ఒక మఠముచెంత

---

**2. నరసింహఘట్టము :** పూరీ సముద్రతీరంలో ప్రజలు సముద్రస్నానం చేయడానికి అనుకూలంగా ఉన్న ఘట్టాలలో ఒకటి.

బెద్దగడ్డములు, మీసములు జడలతో నున్న యోగులు కట్టిన కొండముచ్చులలో నొకదాని చెంగటకుబోయి నా చిన్నగావంచాతో దానిని గొట్టుచుంటిని. ఆ హనుమంతు సాధుజంతువు గనుక నూరకొన్నది. అదిచూచి యచటి బైరాగి నాతో నాకోతిని గావంచాతో గొట్ట మనెను. నే నట్లు సేయగా దురుసుగ నటించు నా(ముక్కడి(క్రోతి నా (క్రొత్తగావంచాను ముక్కముక్కలుగ జీర్చెను. పిదప నిం(ద్రద్యుమ్న³మనుకోనేటిని జూచితిమి, నీరాకుపసరుగనున్నను స్వచ్ఛముగ నుండెను. పెద్ద తాబేళ్లా కొలనులోనుంచి మేమందిచ్చు పేలాలు తినుట వింత యయ్యెను. సాయంకాలము నొక ఇన్స్పెక్టరునొద్ద మాయిరువురున్నదమ్ములము కలసి జోడుగా పద్యములు చదివి (ప్రహ్లాదనాటకములోని కీర్తనలు పాడినాము. తీయని లేత శారీరములకు తోడు నీతియు భక్తియు బోధించు మాపద్యముల కాయుద్యోగి మెచ్చుకొని మాయిద్దరికి జెరి రెండు రూపాయలు దయచేసెను. "ఆహా! ఎంత తీయని పాట. యమకింకరులవంటి వారికిగూడ మనసు కరిగించును గదా?"యని మాతం(డ్రి యాశ్చర్యపడెను. ఆ రా(త్రి మరీ (ప్రసాదపు ముతక యె(ర్రకూడు భుజించలేక వండుకొని తిన్నాము. (ప్రభాతవేళ నన్నికుండికలలోను సము(ద్రమందును వివిధ తీర్థ స్నానములు చేయుచు, మూన్నాళ్లు శ్రీజగన్నాథమున వసించి, శ్రీజగన్నాథ పటములను, పతితపావన మృత్తికయును దులసి పూసల పేర్లు మొదలగు శ్రీజగన్నాథమున సంపాదించవలసిన సమస్తవస్తువులను బట్టుకొని శ్రీజగన్నాథమును విడిచి రక్తమట్టి యనుస్థలమునకు జేరుకొంటిమి. అప్పటికి మాయయ్య కేబది మూడేండ్లు, మాయమ్మకేబది, పేరన్నకు పదునొకొండు నాకు తొమ్మిదేండ్లు పైగా (ప్రాయము. అచట వండుకొని తిన్నమీద మాచెంగట వండుకొని భోజనము చేసిన కొందరు సాధులు "కాలినడకపై మోకాలి నీటిబంటి లోతు దారిని సము(ద్రము దాటి గంజాము పోవచ్చును. బదిపదేను రూపాయి లోడవారలకీయవలెను. మీరు వెంబడి రాగలరా?" యనగా సత్యకాలపు నా తం(డ్రి మంచిదని యంగీకరించెను. కాలినడకతో బోవుచుండి మయ్యయో యేమి చెప్పగలను? మా (శ్రమ దేవున కెరుక.

పిమ్మట నాజోగులవెంట నందంద ముణుకుబంటి, తొడబంటి, బొడ్డుబంటి, రొమ్ముబంటి నీళ్లుగల దారి గడచుచు జగన్నాథా నీవేమాకు శరణమని మాటికిమాటికి జగన్నాథుని స్మరించుచు, శ్రీకృష్ణుని కళేబరము నర్జునుడు ద్వారకాసము(ద్రమున వైవ నాకబంధము శ్రీజగన్నాథము రేవున దేలి యచట యిం(ద్రద్యుమ్న మహారాజునకు దొరికి

3. **ఇం(ద్రద్యుమ్నము** : పూరీక్షే(త్రపురాణాన్ని అనుసరించి జగన్నాథాలయాన్ని మొదట నిర్మించినవాడు ఇం(ద్రద్యుమ్న మహారాజు పేరుతో ఏర్పడిన సరోవరం. పూరీ పట్టణ (ప్రధాన మార్గానికి బడదండ (ముఖ్యమార్గము, పెద్దదారి) అని పేరు. ఈ బడదండ జగన్నాథాలయం తూర్పు సింహద్వారం నుండి (ప్రారంభమై గుండిచా మందిరం (ఇం(ద్రద్యుమ్నుని భార్య గుండిచ)తో ముగుస్తుంది. ఇం(ద్రద్యుమ్నం గుండిచా మందిరానికి వెనుకవైపున ఉంటుంది.

దేవాలయమున స్థాపింపబడుట మొదలగు శ్రీజగన్నాథక్షేత్ర మాహాత్మ్య కథలను నా తండ్రి నా తల్లికి విన్పించుట భక్తిశ్రద్ధలతో నాలించుచు, రెండుప్రక్కలను లోతునీట జల సముద్రమున నెగిరి త్రుళ్లిపడు జలజంతువుల వింతపడి పరికించుచు నందంద బలిసి నిలువులకొలది పెరిగి ధవళమేఘములవలె గాలికిజలించు, పూచిన రెల్లుచే లతిక్రమించుచు, సాయంకాలమునకు బదిక్రోసుల మేరను చిలకసముద్రపుత్రోవ నడిచి యొడ్డెపల్లెలో నేడు గంటలరాత్రికి జేరుకొంటిమి. వీధిలో నామార్గశీర్ష పూర్ణచంద్రిక న్మిగుల శీతబాధ తగిలియు నిశీధ సమయమున నటుకులు పెరుగులో నానవైచుకొని భుజించి వేకువజాము వరకు నిదురించి, తిరిగి యాజోగుల వెంబడి కొబ్బరితోటలతోడ, సముద్రపుతంపరలతో ననంటి తోటలతో, సర్పచెముదు తుప్పలతో, మొగలి డొంకలతో, నిసుకదిబ్బలతో నిండి సముద్రపుటొడ్డు రెండుమూడు క్రోసుల దూరముగా, నిరుకు జంతులు, కురుచ పూరియిండ్ల వాసనలతో, పచ్చని మురికి నీటి గుంటలతో, బేడిస తోరణములు, చేతుల నెర్రనీళ్ల కుండికలు జంకల ధరించి ముతకచీర ముసుంగులతో నీళ్లరేవున రాకపోకలు సల్పు వాడిచూపుల యొడ్డెగరితెలను, వీనుల వ్రేలాడే బంగరు గుల్లగుండు జోళ్లు, మూపున జన్నిదములు, పొగాకుతమ్ములమున లక్కపిడతల నగపడునోళ్లు, చేతమునికోలలు వెలయ దున్నుకొను నొడ్డె బ్రాహ్మణులను, సన్నవు పొడవు పత్రములతో మిగులచుల్కనగు శకటములకు బూన్పబడి పరుగుతో నడకయెరుగని తెల్ల పొట్టి యాలగిత్తలను, గుడ్లగూబల వలె నుల్లాసమున నూలలువేయుచు బాదు బండితోలునొడ్డెకాపులను, గనుగొనుచు బొత్తిగ దెలుగుమాటతెలియని పెక్కొడ్డెపల్లె లతిక్రమించి గంజామునకేగు రాచబాట సంతోషముతో జేరుకొంటిమి.

మాకు దోడువచ్చిన సాధువులు "మేమిక రంభకేగెదము. మీరు క్రోసెడు మేరనున్న గంజామునకు దక్షిణముగా బొండ"ని చెప్పి యదృశ్యులైరి. అప్పుడు పగలు రెండుజాముల వేళ మించెను. గంజామునకు రంభకు మధ్యగా రోడ్డుపైనున్న యేదోయొక కోటపేరుగల గ్రామమునకు జేరుకొంటిమి. అచట సదావృత్తి యిచ్చిరి. మాతండ్రి చెంగటిచెరువులో స్నానమాడి యొకచెట్టుక్రింద నత్తెసరుడికించుచు మాతల్లితో "ఏమే, నీవు తినెదవా లేదా?" యనెను. అందులకు మా తల్లి "అయ్యో! రోడ్డు జనసంచారమింతయనాచారముగా నెట్లు తినగలను?"యని మారుచెప్పెను. అందుకు మా తండ్రి "తినెదవా లేదా? తినెదవా లేదా"? యని ప్రత్యుత్తరముగానక కోపముతో నుడుకుచున్న కుండను నేలకొట్టి వేసెను. అయ్యో పిల్లలకైనను లేకుండ వ్యర్థముగా నన్నము బుగ్గిపాల్జేసినారని మా తల్లి విచారించెను. "రారా పేరయ్యా" అని మాయన్నను బిల్చి మాతండ్రి ముందు నడువసాగెను. అడుగామడగా శ్రమతో మెల్లమెల్లగ మాయమ్మయు నేను వారి వెంబడి నడువసాగితిమి. గంజామున

కారుగంటలు మించకుండ జేరితిమి. ఒక బ్రాహ్మణ గృహమున వంకాయ ముద్ద, పెసరపచ్చడి, ప్రశస్తమైన సన్నబియ్యపుటన్నము మాయమ్మ వండగా మిగులరుచ్యముగా బేరాకటను జవి రెట్టించినయా పదార్థముల నెయ్యిబెరుగులతో కడుపునిండ హాయిగా గుడిచి, యేయాపదలున్నానీక దారిగడిపిన శ్రీజగన్నాథుని వేనోళ్ల గొనియాడుచు, మిగుల బడలుటచే గాఢనిద్ర నారేయిగడిపి తెల్లవారినదనుక మిక్కిలిదూరముగ సంకట మార్గమున నాకలినిద్రలుమాని నడచుటచే బులిసి పగిలి వాచిన కాళ్లకు చమురు రుద్దుకొని, వేడినీళ్ల స్నేదవు తోముకొని స్నానము చేసికొని యాపూట కూడ గంజామున నాగితిమి. సంసారుల పిల్లలకు భాగ్యవంతుల బాలలకన్న మొత్తముపై దేహబలము, బుద్ధిబలము నధికముగా గలిగియుండుటయును, లేమిచే జవి రెట్టింపబడిన భోజనముచే శ్రీమంతుల పిల్లలకన్న నెక్కుదు సంతుష్టియు నారోగ్యమును గలిగి యుండుననియును నాయూహ.

మరునాడుదయమున గంజాము విడిచి యేరుదాటుచున్నప్పుడు గంజాము రెండునాళ్లకు బాడైన ముచ్చట మాతో నొక పథికుడిట్లు చెప్పెను. ఒకనాటి రాత్రి యేటి యావల పెద్దధ్వని యూళ్లోవారికి వినబడినదట. ఆ ధ్వని చెవిదాకినవాడెల్ల అనగా నూరిలోబదేనువీసములజనులు విశూచిచే జచ్చిరట. ఒక నల్లని ముసలిది చీపురుకట్ట పట్టుకొని వీధులలో సంచరించెనట. ఆపెయే గంజాము ముసలమ్మ, గొట్టాలమ్మ, మారమ్మ యనుపేర్లతో గంజాము నుండి నలుదెసలకు బ్రయాణము సేయుచు, భూభారము మాన్పుచుండును. ఈ ముచ్చట విన్నతోడనే గంజాము ముసలమ్మ నాకనులబడినట్లు నాకు భయము పుట్టెను. పిదప మేము ఛత్రపురము చేరితిమి. అచ్చటినుండి మాయూరికేగు నొక బంధువునిచేత నూరు రూపాయిలిచ్చి యాద్రవ్యము మాయూరిభుక్తకు దానీయవలసిన భూమి యప్పనము చెల్లించుమని యతనితో నాతండ్రి చెప్పి పంపెను.

# అధ్యాయం - 4

పిదప నచ్చట నున్నవ రామలింగము మొదలగు వారియొద్ద పది పదేనురూప్యములు సంభావనమంది, యోదాతృమూర్ధన్యా! తృణీకృత పురందరా! సర్వస్వతంత్రా! మిస్తుల సౌందర్య విద్యా సంపద్భోగబల వైభవా! యంతరంగ భక్త శిఖామణీ! చిత్తగింపుము.

నీయనుజుని సంవత్సరీకకర్మములను గన్నీరొలుక గావించుచున్న నీయొద్దకు వచ్చినా, మపుడు పెద్దవెండిగిన్నెనిండ రూప్యములు పట్టించుకొని శ్రోత్రియులకు దానమొనర్చుచున్న నీవు మాతండ్రిగారిన్గని "శాస్త్రి గారూ! సమయమునకేతెంచితి"రని పల్కరించి నూరు రూపాయిలు దానమొసంగితిరి. తమయింటి సత్రమున రెండుదినములాగి మీ యొద్ద సెలవు నా తండ్రి తీసుకొన్నప్పుడు తమరు నన్ను నా తండ్రి కగపర్చి "శాస్త్రిగారూ! వీడు గొప్పవాడగును. వీని కింగ్లీషువిద్య యెట్లైన నేర్పించుడు" అని సెలవిచ్చిరి. పిమ్మట దమకుమార్తె నత్తింటికి దిగబెట్టుటకై మాయూరి చెంగటి గ్రామమునకు బయలుదేరి, మా పెద్దతల్లియు నాపెభర్తయును తోడరా కతిపయ ప్రయాణంబుల వారుకుదిర్చిన బండిపై ముఖలింగమను గ్రామము మీదుగా వారాగిన మద్దెలవలస యను మాయూరు చెంగటిపల్లె మూడు దినములు వసించి, మాపెద్దన్నయు, మూడవయన్నయు నా ముప్వురక్క చెల్లెండ్రు నొక క్రోసుమేర మాకెదురురా, సంతోషము మూర్తీభవించినట్లు మా గ్రామస్థులందరనుకొన పదినెలలకు దిరిగి మాయిల్లు జేరుకొంటిమి. ఇరువురు పిల్లలతో గూడ నా రెండవ యప్ప యిరువదిరెండేండ్ల వయసున ముత్తైదుగా గతించుట తప్ప నా తండ్రి దుర్భరగర్భశోక మెరుగడు. ఆపె మా తలిదండ్రులు కాశీయాత్ర కేగినపుడు నన్ను నా మేనమామగారి యూరి నుండి పిలిపించి చల్లపాలకాయలు వండి కడుపు నిండ బెట్టెను. మేల్మి బంగారు వంటి దేహమును మనస్సును గలది.

మాపెద్దక్క యత్తగారి యూరైన పిడిసీల యగ్రహారమునకు మా తల్లిదండ్రులు కార్యాంతరముపై వెళ్లినపుడు వారు వచ్చునంతదనుకు మా బుచ్చిమామగారింట్లో నన్నుంచుటకు వంతరామునకు వెళ్లిరి. మా తల్లి పుట్టింటివారు కొంచము భాగ్యవంతులు; ఆడబిడ్డలయందు వారి సంతానములయందు ప్రేమకలవారు. మా తల్లులార్గురిలోను మాయమ్మ యత్తవారే కొంచెపు స్థితి కలవారు. కాబట్టి మా తల్లికి గావలసిన ధనసాహాయ్యి మాపెపుట్టినవారిలో ముఖ్యముగా మా బుచ్చిమామ సేయుచుండును. మేమావంతరామునకు వెళ్లిన మరునాడచటికి వాసా సాంబయ్యగారను బొబ్బిలి సంస్థాన వైణికుడు వచ్చెను. మా బుచ్చిమామయ్య గారి యింటికి దరచుగా నతిథులు వచ్చి సత్కారము పొంది యేగుచుందురు. ఆ సాంబయ్యగారు నన్ను జూచి నేను పద్యములు చదివి కూనిదీర్ఘములు తీయగా నా శారీరమునకు సంతోషించి మాయమ్మతో "అప్పా! ఈ చిన్నవాడికి సంగీతము

చెప్పెదను. వీడు పనికివచ్చునని నా నమ్మకము. నాతో బంపుము" అనును. అందుకు మాతల్లిదండ్రులు లొప్పుకొని నన్నతనితో బంపిరి.

గురుశిష్యులము మేముభయులము జాముర్రాత్రి యుండగా బైలుదేరి మామిడివలస యగ్రహారమునకు నొకకావిడివానిని దీసికొని నడువసాగితిమి. మా గురువుగారప్పటి కిరువది యారేండ్లవయసువారు. అపుడు నా వయసు తొమ్మిది పదేండ్ల నడుమ. మా గురువుగారి చెవులకు బంగారు దుద్దులు కలవు. బొబ్బిలిలో చలువచేయబడుటచే నీలిరంగుపట్టిన తెల్లని ధోవతియు జల్తారుత్తరీయమును నాకు వింతగ నున్నవి. అతనికి బలాత్కారముగా వంగుటకై కాగితముతోగట్టిన గేరా కలదు. ఎముకపుష్టి గల తెల్లని షళాకు వంటివాడు. కడుదొడ్డవాడు. అతడు కావడినొక కొమ్మున వీణతో నొకబట్టల మూటయు నింకొకకొమ్మున నొకపెట్టెయును, ముందు కావడివాడు, వెనుక సాంబయ్య గారా వెనుక గోచియు, నడ్డికిగట్టిన చిన్న గావంచాతో బరుగిడు నేనును, పొలములు మెఱక, వేళ్లు, గడ్డలు, చెర్వు, లడవులు, తుప్పలు, తోటలు మెట్ట లతిక్రమించుచు, మాటిమాటికి వెన్దిరిగి జూచుచు రారా యబ్బాయి యని మా గురువుగారు ప్రేమతో నన్ను బిల్చుచుండగ, మధ్యాహ్నమునకు బది క్రోసుల మేర గడచి మామిడివలస చేరుకొంటి, మది యతని యత్తవారి యూరు. నిషేకమునకై యతడా యూరికి బోవుచు ద్రోవలో సులభముగ జిక్కిన నన్ను శిష్యమిషపై పరిచారకునిగ గొనిపోయెను.

తామరాకునందలి నీటిచుక్కవలె జగమున నా మనసంటియు నంటకుంటచే జీవన్ముక్తునివలె నైదేండ్ల మొదలుకొని పదేండ్లమించిన వయసు వరకు తల్లిదండ్రులపై గాని, యితర బంధువులపైగాని, మరి యేమమత్వముగాని నాకు లేనే లేదు. వర్తమానము తప్ప భూతభావికాలముల తలంపే నాకు లేదు. ఎద్దియో విచిత్ర సంకల్పమూర్తినై, జగద్వికారముల బరికించుచుండియు నొక్కింతయు న్దగులు లేక చరించుచు, శరవేగమున సంస్కృతాంధ్రకావ్యముల గొంతయర్థస్ఫూర్తిగా, యథేష్ట రాగలయలతో జదువుచు, సంతతానందమున దిరుగులాడుచున్న నన్నద్భుతానురాగముల పెద్దలందరు బరికించు చుండిరి.

మామిడివలస వెళ్లినతోనె యొడలు గడుగుకొని చల్ది భుజించి మిక్కిలి బడలియుండుటచే హాయిగ నిద్రించినాడను. ఆయూర పదేను దినములున్నాము. గురువుగారును గురుపత్నియు నన్ను గన్నకొడుకువలె పోషించుచుండిరి. అచటి గ్రామదేవత పండుగకు నాచే వాలకము[1] కట్టించి మా గురువుగారు నవ్వుచుందురు. పన్నెండేండ్ల

---

**1. వాలకము :** పగటివేషము. ఉత్తరాంధ్రలో జాతరలు, తిరునాళ్లు, తీర్థాల సమయంలో వాలకాలు ప్రధాన వినోద సాధనం.

వయసు వరకు గోచీతప్ప వస్త్రము నే గట్టియెరుగను. మా గురువుగారచటి నుండి నన్ను పాలకొండకు దీసికొనిపోయిరి, అచట వారికి శిష్యురాండ్రు వెలచేడియలు కలరు. అచట యొక పసపుగావంచా యిప్పించిరి. గావంచా నడ్డికి జుట్టుకొని మందు వేసవి రాత్రి నడివీధిలో వడకయుత్సవము[2]లో నాచురంగు[3] జూచి చూచి నిద్రించితిని. ఎవడో యొక పుణ్యాత్ముడు నా గావంచాను దొంగిలించెను. తెలవారినతోనె గావంచా గోలుపోయినందుకు దీనాననముతో మా గురువుగారి చెంతకు బోయినాడను. మా గురువుగారు నవ్వుచు "ఏదిరా నీ గావంచా, పారవేసినావా యేమి?" యనెను. అందుకు నేను "అయ్యా! ఎవడో దొంగిలించెను" అని బదులు చెప్పినా నప్పుడు "పోలేదిదిగో యొదలు మరచి వీధిలో నీవు నిద్రించుచుండ నెవడైనా దొంగిలించునేమో యని నేనే తీసినాను" అని నాకు జలిది వెట్టించి తన శిష్యురాలి యింటికి నన్ను దోడ్కొనిపోయెను.

ఆపె మొగిలిరేకువంటి తెల్లని వెలపొలతి. పదునారేండ్ల వయసు కలది. ఆమె మంచము క్రింద మా గురువుగారి వీణె యున్నది. ఆమె యద్దాల బీరువాలో మా గురువుగారాపెకై తెచ్చి గుల్‌కందు సీసా నుంచిరి. వారుభయులు వేరుగా ముచ్చటించు కొనుచుండగా నేనా గుల్‌కంద నదివరకెన్నడు నెరుగను, మిక్కిలి రుచిగానుండుటచే మూదువంతులు భక్షించి తక్కినది గూడ భక్షించుచుండగా నాపె యెందుకో యాగదికి వచ్చి నన్ను జూచి తిట్టుచు గొట్టబోయెను. మా గురువుగారు దబ్బున నవ్వి "వానినేమియు ననకు పిల్లవాడు" అని యామెను గదిమెను. పిమ్మట వీణ వాయించెను. ఆ తంత్రీనాదము మొట్టమొదట నా జన్మములో శ్రవణపర్వము గావించెను.

పిదప మా గురువుగారు మాయూరునకు నాలుగు క్రోసులు దూరముననున్న నారాయణపురనివాసియగు తనతోడియల్లుని తోడిచ్చి నన్ను మా గ్రామమునకు వెళ్లి బొబ్బిలికి రమ్మని పంపెను. నేను నారాయణపురము నుండి యొంటిగా బయలుదేరి యచటికొక క్రోసుననున్న పల్లపుచాకరాపల్లి యగ్రహారమునకు వచ్చి మా పెదతల్లి కుమార్తె సీతమ్మ గారి యింట్లో దిగినాను. తల్లి వంకవారికున్న ప్రేమ తండ్రివంకవారి కుండదు గదా! ఆపె కుదిమట్టపు దంతపుబొమ్మ వంటిది. బహుసంతానవతి. తమ్ముడు తమ్ముడాయని నన్నెంతో యాదరించి యన్నము పెట్టెను. మరునాడు మధ్యాహ్నము తన పెద్దకొడుకునకు సహాయముగా నన్ను దనపుట్టిల్లైన బొమ్మికపాడను గ్రామమున కంపెను. మేముభయులము బైలుదేరి, చిన్నచిన్నవలసలు దాటుచు, తుప్పడవి మెట్టదారిని మూడుక్రోసుల మేర బూచిన యూడికచెట్లు, కాచినమావిళ్లు జూచుచు, వాకపండ్లేరికొని తినుచు వెర్రిమొర్రిపాటలు

**2. వడక ఉత్సవము** = ఉపనయన శుభకార్యం.

**3. నాచురంగు** = బోగంమేళం.

పాడుచు బలురకంబుల పిట్టల కూతలు వినుచు నేటియొడ్డున గొంతదవ్వు నడిచి తుదకొక గొడ్డురాళ్లదిబ్బపై నేటియొడ్డున నున్న బొమ్మికపాడునకు, గడియమెరుగుండగా[4] జేరు కొంటిమి. మా పెదతల్లి విశాలాక్షమ్మ దెబ్బదేండ్లది. యామెభర్త గుండ్రని మెరుపు పెద్దకనులు గల ముసలివాడు. ఆ పుణ్యదంపతులు పెద్దకుటుంబము కలవారు. సంవత్సరమున కారువందల రూపాయల రాబడిగల భూస్వాములు. అచట రెండుమూడు పూటలుండి నేను మాయూరునకు జేరుకొంటిని. నా తలిదండ్రులు సోదర సోదరీలు నన్ను మిగుల సంతోషముతో లాలించిరి, మాయమ్మ నన్ను జేరదీసి "అన్నా! యెంత సంగీతము నేర్చుకొన్నావు" అని యడిగెను. నేనందుకు "అమ్మా! వీణ వాయించగలను. చూడు మిదిగో యెట్లు పాడుదునో" యని మునపటికన్న పెద్దగొంతువెట్టి వింతవింతదీర్ఘములు దీసినాడను. అందుకు మాయమ్మ నవ్వి "ఓరి నీయమ్మ కనులు మండ, నీకింతటితోనే సంగీతమంతయు వచ్చినదనుకొన్నావా?" యనెను. మా తండ్రియు నేనొంటిగ దేశసంచారము చేయగల ధైర్యవంతుడనైతినని చిరునగవుతో నాపయిమీద గావంచా చూచి "ఇదెక్కడ సంపాదించావురా" యనెను. అందుకు "దీనిని మా గురువుగారిచ్చినారు" అని యంటిని. "గురువును మెప్పించిన శిష్యుడవైతివా?" యని నవ్వుకొనెను.

మరికొన్నాళ్లకు నన్ను మా గురువుగారు బొబ్బిలికి రమ్మన్నారని నేజెప్పగా, బలువురకు దిండిపెట్టి పోషించుట కష్టమని గాబోలు చదువు మిషపై నన్ను మాతలిదండ్రులు మా పెద్దన్న జగ్గావధానులును తోడిచ్చి బొబ్బిలికి పంపిరి. భాగ్యవంతుల పిల్లలు నాతోడివారు హాయిగా మాయూరనే యుండగా, మాతండ్రి మొదలగువారు పలువురు విద్వాంసులుండగా నాకు మాత్రము పైయూరు చదువెందుకు? ఆహా, రిక్తదశ యెట్టి కష్టములైన సహించును గదా? మేమిద్దరము తెలతెలవారుచుండగా బయనమై గున్నటేన్గువలె ముందు మాపెద్దన్నయు వెన్క పరువిడుచు నేను బోవుచు జాముప్రొద్దునకు బొబ్బిలి కేగితిమి. నన్ను మా గురువుగారి కప్పగించి రాజసత్రమునకు భోజనముకై మా పెద్దన్న వెళ్లెను. నాకు మా గురువు చలిది కడుపునింద బెట్టించినారు.

మాగురువుగారి పెద్దన్న సర్వయ్యగా రతని కేడువందల గీతములు మరియు నెంతో సంగీత గ్రంథము వచ్చునట. కాని తా బాడలేదు. పరులు పాడిన రాగము లెవ్వియు బోల్చజాలడు. రెండవయన్న యప్పయ్య, అతడు జగదేక వైణికుడని ప్రసిద్ధి పొందెను. గాని నే బొబ్బిలికి వెళ్లకముందే స్వర్గస్థుడయ్యెను. మూడవయన్న కామయ్య గారు, అతడు

4. **గడియమెరుగుండగా** : సూర్యాస్తమయానికి ఇంకా ఒక ఘడియ సమయముండగా.

గొప్పవైణికుడు, ప్రశస్తమైన సంగీత గ్రంథకర్త. అతని కొకకొడుకు నొకకూతురు గలరు. భార్య కాలముచేయుటచే విరక్తుడై గడ్డము పెంచుకొనెను. పెద్ద తవ్వవంటి పందు వెదురు బొంగున కొక యుక్కుతీగె మాత్రము కట్టి శ్రుతిచేసి యొకవెడల్పు చాయకత్తికి గుంకుమము పూజచేసి, మూరెడు పొడవు తెల్లని గడ్డముతో, గట్టిపొట్టి శరీరముతో, సింహము వలె రౌద్రరసముప్పతిల్ల, "హరిహర" యనునాద మాకసమవియ భజనచేయుచు వాసా సాంబయ్యగారియన్న కామయ్యగారు నుదుట గంధమును బెద్దబొట్టుతో భీకరాకారముతో గొండల న్గొలకుల ప్రతిధ్వనింపజేయుచు బలువురశిష్యులకు వీణాగాన ముపదేశించు చుండును. నాల్గవయతను మాగురు వైదవయతడు కృష్ణమూర్తి గారు. అతడు గొప్ప వైణికుడు. ద్రుతవాద్య విశారదుడు, వారి తల్లి బ్రతికియున్నది. బిందెకుండవలె గుండ్రని తెల్లనియాపె. కదుమంచిది. మా బోంట్ల కందరికి జల్దివెట్టి యాదరించు చుండును. పప్పు వెంకన్న, కట్టు సూరన్న, ముదిగంటి సూర్యనారాయణ మొదలగు నిరువది ముప్పది మంది బ్రాహ్మణులు, తక్కిన జాతివాండ్రు మరికొందరు శిష్యులుండిరి. కొందరు వీణ, గాత్రము నభ్యసించువారు. నాకు మా గురువుగారు వారములు చెప్పించిరి. అయిదు వారములు మాత్రమే కుదిరినవి.

ఒకనాడు వారమెక్కడను లేదు. భోజన మెక్కడ దొరుకునోయని వెదకుచు నొకని యింట్లో జొరబడినాను. అల్లమరాజు దుర్గయ్య పంతు లనునతడు స్నానము చేయుచున్నాడు. అతనికై యతని భార్య వడ్డించెను. అతను లోనికి రాకముం దతనివిస్తరికి దలపడి పరిషించి భోజనము సేయుచున్నాను. ఇంతట నతడు వచ్చెను. అతనిభార్య యతనితో "చూచితిరా! వీడెవడో నన్నము పెట్టెదవా యని యడుగగా నేను లేదు పొమ్మంటిని. వీడు వీధి గుమ్మము వరకు మళ్లి నేను వడ్డించుట చూచి తిరిగి వచ్చి యెట్లు విస్తరికి గలపడి తినుచున్నాడో?" యని యనెను. అందుకాపంతులు "వీడెవడా మనపాలిటి సూర్యనారాయణమూర్తియే. మనకు బిల్లలు లేరని యీరూపముగా వచ్చి తినుచున్నాడు. పాపమెంత యాకలి వేసెననో" యని కంట నీరిడుకొని "నేయి వడ్డించు ముత్తయన్నము బొక్కుచున్నాడు" అనెను. అందుకాయిల్లాలు నేయి వేసెను. ఇంకొక విస్తరి వేయించుకొని పంతులు కూడ పరిషించి భోజనము సేయుచు నా సంగతి యడిగి నాచే దెలిసికొని "నేటినుండి నీకాదివార మిచ్చినాను. నీవీయూర నుండి నన్నినాళ్లు నాకభ్యంతరము లేదు" అనెను. భోజనము చేసిన పిదప నచట నా కంటబడిన భారతము తీసి శరవేగమున జదివితిని. ఆ వధూవరు లిద్దరెంతయో సంతోషించి యప్పటి నుండి నన్నుజూచినప్పుడెల్ల కన్నకొడుకు వలె నాదరించుచుండువారు.

బొబ్బిలి నేనిదివరకు జూచిన పార్వతీపురము పాలకొండలకన్న రాజుకోట[5] కలిగియుంటచే మిక్కిలి వైభవముగ నుండెను. నేనచట గ్రొత్తగా నేన్గులు చూచియుంటచే మిక్కిలి యద్భుతపడితిని. ఎఱ్ఱకుచ్చు బొందులతో, బెనవెట్టి వైచుకొన్న పొడవు పెద్ద సికముళ్లతో, మూరెడు వెడల్పు జల్తారంచుల నీలిఖండవా వలెవాటులతో, నొంటిచేత బంగరు కడియములతో, నోట మూరెడుచుట్ట నొద్దుపొడవుల పరువుమాటగోటులతో, బైజారునీటులతో సంచరించు వెలమదొరలను, దిక్కులు పిక్కటిల్ల ఘంటానాదం బిరుదెసల మ్రోయ, వీధుల వెంబడి నిండ్లకన్ననెత్తుగ నడుచు పెద్దేనుంగులును, రౌతులతో శరవేగంబున బర్విడు తురుపుగుఱ్ఱము[6]లును, పెద్దచెంపకొప్పుల బంగరుచేమంతిపూలు మెరయ, కోటనుండి రాకపోకలు సలుపు దాసీరత్నములను గల బొబ్బిలి పరువు న్సిరియు మూర్తీభవించినట్లున్నది.

మా గురువుగా రొకనాడు నాచే సాపాయని మంచిముహూర్తము చూచి యనిపించినారు. సాయంకాలమున గురన్నచెర్వులో గామయ్యగారు స్నానము చేయుట, యాజీకటివేళ తెల్లనిసబ్బుతో శిష్యులతని యొడలు దోముటయు, గొండకు జట్లుకట్టి కామయ్య గారితో ఫలహారములు పట్టుకొని వెళ్లుట యప్పటి గురువులయందు శిష్యులకుగల భక్తి నుగ్గడించును. ఒకప్పుడు రెండుజాములరాత్రికి బాలతేరుగ్రామములో సంభావన మిచ్చిరి. నాకొక యణా దొరికినది. కామయ్యగారి మంచముపొరలో దాచుకొంటిని. దాని నతనికుమారుడు దొంగిలించి చిన్నపేక కొనివేసెను. అది తెలిసి కామయ్యగారితో నే జెప్పగా గొడుకును జీవాట్లు పెట్టి యణా క్రింద నాకొక చిన్నగావంచా యిచ్చెను. బజారులోని మిఠాయి చూచి యెంతో నోరూరగా దుకాణములచెంత దిరుగువాడను. కానీయైనను నాయొద్దలేదు. మిఠాయి యెట్లు చిక్కును? ఆహా! చెల్లనప్పుడు భోగేచ్ఛ మెందుకదా! ఒకనాటి వేసవిసంజకడ కోటలోని కుల్లాసముగ బాడుకొనుచు, భోజనముకై

---

**5. రాజుకోట :** క్రీ.శ. 1652లో రాయుడప్ప ద్వారా బొబ్బిలి సంస్థాన స్థాపన జరిగింది. 1757లో బొబ్బిలియుద్ధం, 1766లో విజయనగర సంస్థానం దివాను సీతారామరాజు బొబ్బిలి జమీందారుని చెరబట్టడం వగైరా కష్టాల గడిచి ఇంగ్లీషువారి దయతో 1794లో కుదురుపాటు కలిగింది. 1875లో దాసుగారు సంగీతం నేర్చుకోవడానికి బొబ్బిలి చేరారు. అప్పటి జమీందారు వెంకటగిరినుండి దత్తు వచ్చిన వేంకట శ్వేతాచలపతి రంగారావు పిన్నవయస్కుడైనందున దత్తుతల్లి లక్ష్మీచెల్లామయ్మగారు సంస్థాన వ్యవహారాలు చూస్తున్నారు. బొబ్బిలి రాజమందిరాలలో పురాతనమైనది వేణుగోపాలస్వామి ఆలయం పక్కన ఉన్నది. దాసుగారు బొబ్బిలి చేరేటప్పటికి రాజకుటుంబం ఈ మందిరంలోనే ఉన్నది. ఇప్పుడు దీనిలో ఒక ప్రైవేటు పాఠశాల నడుస్తున్నది.

**6. తురుపు గుఱ్ఱము :** రాజు విలాసంగా షికారుకు వెళ్లేటప్పుడుగాని, యుద్ధానికి వెళ్లేటప్పుడుగాని రక్షణార్థం రాజుకు ముందు వెనుక ఉండే గుఱ్ఱపుదళం. సంస్థానం హెూదా, ఆదాయాన్ని బట్టి తురుపు గుఱ్ఱాల సంఖ్య మారుతుంటుంది.

బోవుచుండగా, నెర్రని దుప్పటి కప్పుకొని యొకకంట బూవున్న యొక యేబది యేండ్ల పచ్చనిముసలి బ్రాహ్మణు దచట గూర్చుని నన్ను దగ్గరకు రమ్మని పాడ మనెను. నేను మరింత బిగ్గరగా నుల్లాసముతో రాగము దీసితి, నందుకతడు చెంతగలవానితో "వినుడీ పిల్లవాని కెవరునేర్పి రెంత చక్కగా బంధవరాళి *(పంతువరాళి రాగం)* పాడినాడు! పూర్వజన్మవాసన యుండవలె గాని సంగీత మొరులు నేర్పిన నేపాటి కుదురును" అనెను. అందులకు నేనతనితో "నీమెప్పులకేమి గాని యొకవారము తక్కువగ నున్నది. చదువు కొనుచున్నాను వారమిచ్చెదవా?" యంటి, నతడు "నీకెప్పుడు భోజనము దొరకదో యపుడెల్ల మాయింట నీకభ్యంతరము లేదు" అనెను. అతడు సుప్రసిద్ధ భాగవతుడు, అంతసొగసైన శారీర మింకొకనికి లేదట. ఆతని పేరు తుమరాడ వెంకయ్య. బొబ్బిలిలో నెలపదేను దినములుంటిని. సంరక్షణము చాలమి, చిక్కిపోతిని, మాయమ్మ నా సంగతి విని నన్ను బిలిపించి యెంతో ప్రేమతో సంరక్షణ మొనరించెను.

సుంకెలో యజనము జరిగెను. అప్పుడు చమసాధ్వర్యులలో[7] నేనొకడను. వింతగ నార్చుచు గంటి జొన్న కొఱ్ఱ వెన్నుల దిననుంకించు పలురకముల పిట్టలును, చట్లదొంతుల నలవొద్దు[8] చుట్టకుదుళ్ల నెత్తుల మ్రోయుచు పొలముల కేగు కాపుచేడియలును, దమ్ము పట్టిన మళ్ల కూడుపునారకట్టలెక్కించిన కమ్మిబండినుండి నలుదెసల బురద నెగజిమ్ముచు, మోకాలుబంటి యూబినీట న్గదలాడు నెనుపోతులబట్టి నడు మంత్రపుబ్బరసిరిన్దిని క్రొవ్వుజనులవలె నుబ్బు జలగలను, గార్కొనుచున్న ధవళమేఘంబులవలె బ్రేలెడు ప్రత్తిచేలను, దబ్బుదిబ్బని పడు తాటిపండ్లును కూరపాదులనలముకొని క్రమక్రమముగా నున్నతస్థలములకెగబ్రాకి ప్రాయోపవేశంబు చేయు కంబళిపుర్వులను, దశవిధగమకంబుల త్రిస్థాయి భేదంబుల నానావిధశ్రుతుల గొతుపంబుచూపు పిన్న పెద్ద కప్పలను, నానావిధ సస్యకబళ నోత్సుక పశుపక్షిమృగంబుల నదల్చుచు నరపపాకల[9]నరచు పొలములకాపులను, బెడ్డలు రువ్వి తాటాకుగొడుగుల జించుచు, గుమ్మములం బల్లేరుముళ్లు పోయుచు తిట్లు దీవనలుగా భావించు పెంకెబుడుతలను, గౌరీవ్రతముల గైచేసికొని, నానవైచిన పెసలు సెనగలు వాయినంబులిడు కన్నె పడుచుముదుసలి ముత్తైదువులను, నిరతాన్నదాతలవలె

---

7. **చమసాధ్వర్యము** : చమసము అంటే యజ్ఞములో సోమపానం చేయటానికి ఉపయోగించే పాత్ర. ఆధ్వర్యుడు అంటే యజ్ఞం నిర్వహించే వారిలో ప్రధానమైన వ్యక్తులలో ఒకరు. అంత చిన్నవయస్సులో దాసుగారికి ఆధ్వర్యంవంటి బాధ్యతను ఇవ్వరు. సోమపాన పాత్రకు సంబంధించిన పనియేదో అప్పజెప్పి ఉంటారు.

8. **అలవొద్దు** : అలపొద్దు. సాయంకాలంపూట తినే గంజి అన్నం.

9. **అరపపాక** : పొలంలో కాపలాకు కట్టుకొనే ఎత్తైన మంచెని అరప అంటారు. దానిపై నీడకోసం పాక వేసుకుంటే అది అరపపాక.

చేరువన్సులభ జీవనము చేతికందించెడు జలాశయంబులను, లేజవ్వనముమాడ్కి జిగురు బలిసిన యుద్యానవనంబులను, వేదవిహితధర్మముల మాడ్కి నొద్దు చేర్చు నోడలను, నునుసిగ్గు వలపు క్రేగంటిచూపుమాడ్కి బ్రతిక్షణాహ్లాదకరములగు తీగమెఱపుగములను, మంటల మ్రోగు ఫిరంగులవలె మెఱపులన్ గర్జిలు కారుమబ్బులను, రేబవళ్లం దెఱపిలేక జీవనసంతుష్టి సలుపు సప్తాహంబులవలె విలసిల్లు ముసుళ్లను, విధివిహితంబుగ సకలజనాహ్లాదకరంబుగ జరుగు గణపతినవరాత్రంబులను, లుబ్ధగేహంబులమాడ్కి పథిక సంచార విరహితంబులగు మార్గంబులును, పరువు మాలిన పామరులవలె జెలరేగి తిరుగు కుక్కురమిధునంబులను, డంబమగపర్చు లంచగొండులవలె బురి విప్పెడు మయూరంబులను, బయల్పడని మునులవలె దలచూపని కోయిలలను, గన్నేరు, మామిడి, యనటి, జామి, కాకర, నేతిదొండ, మొక్కజొన్న, సమృద్ధిగా మఱికొన్ని కాయగూరలు; మొగిలి, నందివర్ధనము, పట్టెడముండ్ల గోరంట్ల, తుమ్మిక, గన్నేరు, మాలతి మొదలగు పలుతెఱంగుల పూలు; మోదుగు, లోలుగు, పనస, యనంటి, యడ్డంకు మొదలగు విస్తరాకులు; నాకురాలు నువ్వులు, చోళ్లు, గంటెలు, చామలు మొదలు కొన్ని విధముల నవధాన్యములు; బలిసిన పచ్చికబయళ్ల న్మోరలెత్తక కడుపునిండమేసి పొదలిన పసరములతో, మఱిమఱి యావకాయయూట భోజనములతో శ్రావణభాద్రపదములు గడువగా, జీవన సమృద్ధిని న్దనిసి సుప్రసన్నములగు సకల ప్రదేశములను సాయంకాలమున మాత్ర మన్నదానము జరిపెడు దేవీనవరాత్రములను, పుస్తకములకు, జతుర్విధ వాదన యంత్రములకు, ధనభాండారములకును, గలువపూదండల నొనర్చు పూజలను, మహాలయ మంత్రతంత్రములను, జూజములపున్నమయును, గౌరమ్మ జాతరయును, పటాకీల సందడియును, రామలీలామహోత్సవముల విజయదశమినాటి అంబారీయేనుగెక్కి రాజులు జమ్మి నరకుటయును, కార్కొని చూలుదగిలిన వరిపొలములం బనిచుల్కనపడిన సేద్యకాంద్ర తీరుబడి రచ్చవేడుకలను, సమృద్ధమగు పాడిపంటలను వివిధ మృష్టాన్నభోజనములను, దంపతులకు దీరనిపొత్తుగలుపుచు ముదిరెడి శీతవాయువులను, సీతాఫలముల యుమ్మిరియును, అట్లతదియయును, దీపావళిపండుగయును, నాగులచవితి బుట్టలయొద్ద స్త్రీపురుషులొనర్చు పూజలను, సోమవారనక్తవ్రతములను, వనసంతర్పణలను, బాల్యమందహాసములవలె నిర్మలానందకర శరచ్చంద్రికలను, అయిదేండ్ల బాలుర డెందములవలె నిష్కలుష మార్గములను, నిరతాన్నదాతల మాడ్కి సుప్రసన్న జలాశయంబులను గలిగి కాలపురుషోత్తమాంగమువలె విలసిల్లు శరదృతువు; మిధునంబులకు బల్మిం బొత్తుగలపుటుత్తరపుముదురుసీతుగాడ్పులను, మిక్కిలి హితమగు నెగడిమంటలను, శరీరమంతటనిండు ముతగ యున్ని దుస్తులను, కడువృద్ధులవలె పనిలేక

మూలపడిన విసనకఱ్ఱలను జవ్వనముమాడ్కి నాలింగనప్రియంబులగు కుంపటులను, చలిచేతను వన్నియచేతనుగూడ నెల్లఫలములన్మించి పద్మిని వాతెఱ[10]విధమున నొప్పారు కమలాఫలముతొనలను, పగిలిన దానిమ్మపండులతీరున మంచునకు బీటవాఱిన మూతులను, అ సందర్భ కావ్యముల పోల్కి విస్తరిలు కలలను; లుబ్ధునిహస్తమువలె ముడిగిన సకలావయవంబులను, సంక్షిప్తములగు త్రిషవణస్నాననిష్ఠలను, రుచ్యారుచ్యంబగు చింతకాయ ధప్పళమును, గర్భచిహ్నాలగపర్చు మట్లు వేసిన మామిళ్లను, భాగవత సమాజముకరణి మందీకృతతృష్ణలను, దరిద్రమనోరథము తెన్నున దీఱనియాకలియును, పోకిరిముఖములాగున నసహ్యాకర హిమకరబింబమును, వెకలినవ్వుమాడ్కి కనిష్టంబగు వెన్నెలయును, సకలవిద్యాసాధకములును, క్రవ్యాదరుతభయంకరాశీతనిశీథులును, వరిగుప్పలసందుల నొడలుమఱచి నిద్రించు కళ్లము కాపులను, రుచికరములగు పెక్కు రకముల చిక్కుడు కాయల పాదులను, ప్రదీప్తములగు సకలాంతర్బహిర్వహ్నులను, మందీకృతోష్ణకర నీరపిపాసలను, ధనుర్మాసోత్సవములను, వాకిలిముంగిళ్ల ముగ్గుల చిన్నెలను, తీయగుమ్మిడిపండ్ల యీవులను, అత్తింటి నల్లునియున్కి ముచ్చటలను, భోగిమంటలు, మకరసంక్రాంతిమూనాళ్ల పండుగ వేడుకలు, కమ్మజాతర విందులు మున్నగు సకలజనుల యుల్లాసములను కోడి గొఱ్ఱె పందెములను, వన్నెక్కె కాకులెనుములు; కమ్మతావులబుష్పించిన మామిడిచెట్లను, సకలధనధాన్య సంగ్రహ విశేషములను, రథసప్తమిరేగుకాయ జిల్లేడాకుల స్నానంబులను, సూర్యునకు నైవేద్యమిడి చిక్కుడాకుల పంచిపెట్టు గోక్షీరాన్నములను, భీష్మైకాదశివ్రతనిష్ఠలను, ప్రాతస్నాననిష్ఠలను, లేజవ్వన పలుచాలుతెఱగున వన్నెమీఱి తలచూపిన మల్లెమొగ్గలను, జాగరము పూర్ణముగా జేయలేని వారల మోముల నామములుంపించిన రుద్రాభిషేకంబు, శివరాత్రి జాగరణోత్సవములను, లేజవ్వనపు కూటమిపోల్కి నూత్న ప్రియంబులగు మామిడిపిందెలపచ్చడి ముక్కలను, మామిడి, నేరేడు తక్కదక్కిన సకల ఫలముల సమృద్ధియును, మాఘపాలీవర్షములను, జ్వాలాతోరణములు, కామదహనములు, డోలోత్సవములు, హోలీపండుగ వసంతములు, నౌకావిహార సంగీతము, ముదిరిన మామిడికాయలు, కోయిల కూతలు, పనసనేరేడుపండు సంపదలు, సంవత్సరాది క్రొత్తయుడుపులు, వింతగ్రుమ్చుమచ్చులు, దోరమావి యూరగాయలు, మల్లెపూల యుమ్మిరియును, శ్రీరామనవమి మహోత్సవములు, కేతకిరేకులనల్లిన జడలు, గ్రామదేవత పండువు, పీర్లపండుగ సందడిన్, వంతులుగా మ్రోగు సుషిరానద్ధ వాద్యముల[11] జగడములు, పులివేషముల యల్లరినాపు నెఱ్ఱపాగాల

---

**10. వాతెఱ** = పెదవులు.

**11. సుషిరానద్ధ వాద్యములు** : వేణువు, నాదస్వరం వంటి ఊది వాయించేవి సుషిర వాద్యాలు. మద్దెల, డోలు, దప్పు వంటి చర్మ వాద్యాలు ఆనద్ధ వాద్యాలు.

రాజభటుల తునకాలదుడ్లు, సివమెత్తినయాటలు, మారిపితీకిరేయి భజనములు, తొల్కరి పరగటిగాలులు, కొత్తయాలుమగలకూటమివలె నతిరభసములగు మెరపు లుఱుములు, ఒడగళ్లవానలు, మావి, పనస, పెద్దనేరేడు, తీయపండ్ల విందులు, పలుతెరగుల తొలకరిచేల, వదాన్యులచెంతకు యాచకుల మాడ్కి క్రొత్తనీటికెగబ్రాకు చేపలు, దుష్టమైత్రివలె క్షణభంగురములగు నీటివరదలు. జాలరిసందడులు, నీటివంతుపోట్లాటలు, అవివేకి దానమువలె విచిత్రవృష్టులు, నృసింహజయంత్యుత్సవములు, వైశాఖపూజలు, ఆతపత్రవ్య జనోపానహ దానములు, రాల్పగులునట్లు కాచు మండువేసవి చుఱుకుటెండలు, మందమలయానిల సమ్ముగ్ధ ప్రభాతనిద్రలు, సాయంసంధ్యావిహారములు, పాణిగ్రహణ మహోత్సవములు, ప్రణయకలహములు, చెమ్మటల సడలు బిగికౌగిళులు, సకలమిథున పరస్పర దూరశయానములు, సకలజనాశ్రిత వాతాయనములు, అన్యోన్యావలోకన కుతూహల కాముకాక్రాంత బహిఃప్రదేశములు, ప్రవర్ధమాన శిరఃస్నానవ్రతంబులు, పలుచని తడిపుట్టంబుల మనములారించు తరుణాంగక లావణ్యంబును, శ్రీజగన్నాథరథోత్సవంబులు నిర్వాతంబయి యూకైననల్లాడనీక యొడలుడికించు గ్రీష్మంబును క్రమక్రమంబుగ సకలర్తు విశేషంబుల గుర్తెరుగుచుంటిని.

ఒకప్పుడు మా తండ్రి నక్కును[12]కాల్పించి సాగబొడిపించుచుండగా నెర్రగగాలిన నక్కుముక్క త్రుళ్లి మా తండ్రి పాదముపై బడెను. చెంతగలవారెంతపని యెంతపని యనుచుండగా లేదులేదని మా తండ్రి పాదమును విదిల్చి జిరునవ్వుతో బ్రాహ్మణులగ్ని కనుక నగ్ని నాకు జురకలేదని చెప్పెను. కాలిన చేరెడు నక్కుముక్క పాదమునబడి యొకక్షణమున్నను పాదమేమియు జురకకుంట కచటివారెల్ల యాశ్చర్యపడి మా తండ్రి సత్యముచే నట్లయ్యెనని యనుకొనిరి. మా తండ్రి మా పొలముమెట్ట తోటలో నూయి త్రవ్వించెను. దానికై రాళ్లు బెద్దూరుకొండనుండి బళ్లతో దెచ్చుకొంటిమి. ఆరునిల్వులు త్రవ్వినను నీరుపడలేదు. ఒక దినమున మా తండ్రి యుదయముతోనే స్నానము చేసిన విభూతి ధరించి చేత గంటము తాటాకులు పట్టుకొని నన్ను వెంటబెట్టుకొని నూతిగట్టున గూర్చొని "త్రవ్వురా నేడు నీరెట్లుపడదో చూతము" అని "ఏహ్యేహి గంగే తవ దర్శనం హఠాత్" అన నొక అరగంటలో గంగాష్టక మొనర్చినంత పెద్దనీటిసెల నూతినుండి ముమ్మరముగ నుబికెను. మిక్కిలి నాబోటి చూపరులు ఆశ్చర్యము చెందిరి. "ఇది నాలుకా తాటిపట్టా! అబద్ధము నా నోట వచ్చునా?" యని సింహారావమున నా తండ్రి యపుడపుడు పల్కుట నేనెరుగుదును. అతడు మిక్కిలి నిష్కపటుడనియును, నిరంతర తపశ్శాలి యనియును, గోపముబట్టజాలని బలశాలియనియును మాయగ్రహార జనులందరును

12. నక్కు : నాగలికి చివరన బిగించే ఇనుప కర్రు.

భయభక్తులతో నాతనిన్గనుచుందురు. అతడు కొన్ని యష్టకములను ధనంజయవిజయమను నొక ప్రబంధమును సంస్కృతమున విరచించెను. అతని శిష్యులలో నిపుడున్న సుప్రసిద్ధులు ఆదిభట్ట రామమూర్తి శాస్త్రియను తార్కికుడు, కర్రా పాపయ్య శాస్త్రి యను పౌరాణికుడును, గంటి నీలకంఠావధానియను ఘనపాఠి మొదలగువారు.

ఒకనాడు జన్నిదముల పున్నమకు పార్వతీపురములో నాకొక బేడ సంభావన దొరికెను. అర్ధణాకొక పిట్టకలము మరియొక యర్ధణా కారు కాగితములు తక్కిన యణాకొక సిరాబుడ్డియును గొని రెండు జాముల కింటికి వచ్చి కలము సిరాలో ముంచుచు కాగితములపై బెద్దసున్నలను వ్రాయుచుంటి నంతట మాబుచ్చిమామ తన యూరినుండి వచ్చి నా వ్రాత జూచి "గుంటడా యేమీవ్రాత కాకితము సిరా దండుగకా!" యని నవ్వెను.

మా భూవ్యవసాయము ఫలించకుంటచేతను, మిక్కిలి కుటుంబము ప్రబలమై పెండ్లికాబడిన నా మువ్వురు పెద్దన్నల భార్యలు కాపురమునకు వచ్చుటచేతను, నా తలిదండ్రులు క్రమక్రమముగ లేమి ననుభవించవలసి వచ్చెను. భైరపురగ్రామములో వంకాయల బలరామభుక్త యన్నము పెట్టి చదువు చెప్పుచుండెనని విని పేరన్నను నన్ను నచట జదువుకొమ్మని మా తండ్రి పంపెను. మేమిరువురము లక్ష్మీపురములో గొప్పయన్నదాతలును మాజ్ఞాతులునయిన పెద్దయ్యబాబుగారి యింట భోజనముచేసి సాయంకాలమున కేటియొద్దుననే పడమటిదెసకు నడిచి భైరపురము వెళ్లినాము. ఆ భుక్తలిద్ద రన్నదమ్ములు. వేగినాట్లు, స్థితిపరులు. అందులో బెద్ద బలరామభుక్త భామవేషగాడు. చతుర్విధవాద్యముల[13] ప్రవీణుడు, కవియును, దంతపు బొమ్మవలె నుండును. అచట రెండు దినములుంటిమి. "నీవు భామవేషము కట్టెదవేని నిన్ను దయారుచేసెదను. లేకున్న నీవిక్కడ నుండనవసరము లేదు" అనెను. చదువుమిషచే దిండి సాగించుకొనుటకు మేమందుకొప్పక లక్ష్మీపురమునకు దిరిగి వచ్చినాము. పెద్దయ్యబాబు మాకు గడుపునిండ బనసతొనలు బెట్టి యచ్చుమ్మ పనసపండొకటి మా తండ్రికివ్వమని మాచేతి కిచ్చెను. సాయంకాలమున కిల్లుచేరి మా తండ్రికి జరిగినస్థితి చెప్పినాము.

తులసిరామన్నవలస యను నడవిగ్రామమున మా పెద్దన్న యత్తవారున్నారు. మా పెద్దన్న భార్యను మలిసారి తీసికొని వచ్చుటకు నన్ను బంపిరి. ఆ వలసలో మూడు పూటలున్నాను. అచట ఒక పిల్లిపిల్లను గోడకు కొట్టి చంపినా నదియే నా జన్మలో చేసిన జంతుహత్య. పుల్లేరుపండ్లు, పిసివాకపల్లేరి తినుచు బొమ్మకచ్చికలేరుచు నడవిగల చెట్లు

---

**13. చతుర్విధ వాద్యాలు :** సుషిర, ఆనద్ధ, తత, ఘనవాద్యాలు. సుషిర ఆనద్ధ వాద్యాల గురించి పాద సూచిక 12లో. వీణ, సారంగి, సితార వంటి తీగలు వుండేవి తత వాద్యాలు. కంచు తాళాల వంటివి ఘనవాద్యాలు.

చేమలు పిట్టలు జంతువులు చూచి యాశ్చర్యపడుచు మా పెద్దమదినియు నేను కూలివానిని తీసుకొని మా యింటికి వచ్చితిమి. మాలో వదినకు మదిని యనియు బెదతల్లికి బెయ్యమ్మ యనియు పినతల్లికి తోచ్చి యనియు బెదతండ్రికి బెయ్యన్న యనియు చినతండ్రికి చిట్టి యనియు అన్నకాచ యనియు సంజ్ఞలు. మా పెద్దమదిని వచ్చిన సాయంత్రమే యాపె వంటకు ప్రారంభించెను. మాయమ్మ పినతల్లి కొన్నాళ్లును, మా పినతల్లి కొన్నాళ్లు, మా పెద్దవదినె కాపురమునకు వచ్చిన తరువాత యాపెయును మాయింట వండుచుందురు. కాని మాయమ్మ వండుటయరుదు. మాయమ్మకు నలువదేండ్లకుబైన కోడండ్రుండి యింటిపనులు జేసికొనుచుండిరి. మా మూడవయన్నభార్య కూడా కాపురమునకందెను.

నా పదేండ్ల వయస్సునపుడొక మాలవానితో దెబ్బలాట జరిగెను. వాడు నాయీడు వాడు. కాని నాకంటె బలవంతుడు. నీటిలో నడుచుచున్నవాడు వాని నీరు నాపై ద్రుళ్లినందు కలిగి వానికి లెంపకాయ కొట్టితిని. వాడుకూడ నాపై గలపడెను. ఇద్దరమొకగంట ముష్టీముష్టి బాహాబాహి కేశాకేశిగా బోట్లాడినాము. తుదకువాడు నా జన్నిదము ద్రెంచి వేసెను. జన్నిదము తెగిపోయినందు కొకదినమెల్ల విచారగ్రస్తుడనైతిని. స్వభావముగా నే యుద్ధపుంజును. నేను బదునొకొండేండ్ల యీడున నుండి యేటియావల బసుల మేపుచుండగా బేడకళ్లేరుటకు వచ్చిన పదారేండ్ల కరీషకరండవాహిని[14]తో యెట్లో జగడము వచ్చెను. మేమిరువురమే యామెరకపై నుంటిమి. అదియాడుదని శంకించి నాచేతికి వచ్చినట్లు నేగొట్టజాలకుంటి నది నాయశక్తిగ నెంచి నన్ను బేడతట్టతో గొట్టినకొట్లిది వరకు నాకు మరపురాదు. మరువాడ వెంకటావధాని యనువాడు మా కామప్ప మరిది. ప్రస్తుత మొడలెల్ల రుద్రాక్షలు ధరించి భూతి పూసికొని యోగియని ప్రసిద్ధి నొంది ఉర్లాములో బోషింపబడుచుండెను. వాడు నాతో నా పదునొకండవయేట దండెపట్లు పట్టి తలక్రిందుగా బడి తిన్న దెబ్బ యిదివరకు మరచిపోడు. పురాణము చదువుటయందును, పోట్లాటయందును, ఎవనినైనా జొరవగా నడుగుటయందును నాకు సాహసము స్వభావముగా మెండు. నా బ్రతుకేమగునోయనికాని లోకులు నన్నేమో చేసెదరనికాని భయము నాకెన్నడును లేదు. అడవియందైన నిర్భయముగ నొంటిగ నాత్మారాముడనై యుంట నా నైజము.

పిడిసీలలో నొకప్పుడు వైదికశిరోమణియగు నా పెద్దబావ అయ్యగారి ప్రకాశావధాన్లు నూనె మిక్కిలి ఖర్చగునని యెంచి బలవంతముగ గోష్పాదమంత మాత్రముంపించి తక్కిన జుట్టంతయు మంగలిచే గొరిగించెను. నల్లగాజులపేర్లవలె ముచ్చటగా నున్న సందెడు

---

**14. కరీష కరండవాహిని :** కరీషం అంటే పశువులు వేసిన పేడ సహజంగానే ఎండగా ఏర్పడిన పిడక. కరండమంటే తట్ట. పిడకలు ఏరుకోవడానికి బుట్టతెచ్చుకొన్న పిల్ల అని అర్థం.

జుట్టు నాకనిష్టముగా దీయించివేసిన మా బావ నాదినమెల్ల దిట్టుచు నా దుఃఖము చేత నేటికి బారిపోతిని. మణికెడునీటిలో బట్టలుతుకొనుటకై వేయబడినరాతిపై దలపెట్టుకొని శరీరము నీటిలోబెట్టి నిద్రించుచుంటిని. భోజనమునకు రాలేదని నన్ను వెదకుచున్నారు. "వాని కొప్పుజోలి మీకెందుకు? ఎంతపని చేసినారు? ఆ దుఃఖముచే వాడేనూతబడెనో? మరెక్కడికి బోయెనో? యెంతయపకీర్తి?"యని మా పెద్దప్ప ఆమె భర్తను మందలించు చుండెను. రెండుజాములయెండ పిడుగులు దూలుచున్నది. అప్పుడే యెర్రవందు బురదలో నేరు పొంగుచుండెను. నా శరీరములో నాభిక్రింది భాగము నీటమునిగి యుండెను. ఊర్ధ్వ భాగము చాపరాయి మీద నుండెను. ఏరుపొంగుటచేత శిరస్సు తక్క తక్కిన దేహమంతయు నీటిచే నాక్రమింపబడెను. ఆయేరు గంటలో నిలువులకొలది పొంగి వెంటనే తీసిపోవు స్వభావము కలది. అపుడు జయంతి అప్పావధానులెందుకో యేటికి వచ్చి చాపరాతిపై తల మాత్రమగపడగ నిద్రించుచున్న నన్ను బోల్చి నా యొద్దకు వచ్చి యెలుగెత్తి "సూరన్నా, సూరన్నా" యని బిగ్గరగ బిల్చి కొట్టిలేపెను. అప్పటికి నా నోటికి నీరు దాకుచుండెను. నే లేచి యతని వెంటబడి మాయప్పగారింటి కేగిన నా కొరకు వెదకుచున్న మాయమ్మతో "అమ్మా! ఏమి నీ చిన్న కుమారుని యమానుష చేష్ట యెంతహాయిగా నొంటిగా నీటినడుమ నిదురించుచున్నాడు? వీని ముక్కున కొక్కంగుళము తరువాయిగా వడినీరు పారుచున్నదెంత దీర్ఘాయువమ్మా నీ కొడుకు!" అనగా నా తల్లి కంటనీరిడి నన్నెత్తుకొనెను. ఒడలెరుగని వెర్రినిద్ర నా చిన్నప్పటి గుణము.

ఒకప్పుడు మా మూడవయన్న యత్తవారియూరైన సిరిపురమునకు నా తలిదండ్రులతో వెళ్లినాడను. ఒకరాత్రి పదిగంటలవేళకు పిల్లలను దెల్పి తిండిపెట్టి తిరిగి నిద్రపుచ్చుచున్న మా పెద్దక్క యొక్కపక్క పైబరుండి యొక యీడులో నున్న పేరన్నకు నాకు దిండిపెట్టనెంచి మొదట నన్నీడ్చుకొని పోయి వీపుపై నొక గ్రుద్దు గ్రుద్దగా నోరు తెరచితినట. గ్రుద్దుకొక ముద్ద చొప్పున గడుపునిండ నన్నము తినిపించి పక్కపై బరుండ పెట్టెను. అచటిబెండ్లి సందడికి పల్లెటూరు నూరుమంది యొకయింట్లో విడిది చేసియున్నారు. దీపములకాంతి తక్కువగా నుండెను. మరియొక గడియకు మా పెద్దక్క పేరన్నయనుకొని నన్నే తిరిగి విస్తరింట యొద్దకీడ్చుకొని మామూలుగా దెబ్బకొక ముద్ద పెట్టెను. ఆపె పెట్టినయన్నమంతయు దిని కన్నులు విప్పకుండిన నన్ను జూచి "రెండుసార్లును వీనికే తినిపించితివి. పేరన్నకన్నము పెట్టితివా"యని యెవరో యడుగగా "అయ్యో! వీడే పేరన్ననుకున్నాను. దీపములచాటు" అని మా పెద్దక్క నోరుమూసికొని యాశ్చర్యపడగా నచటివారెల్ల పక్కలు పట్టుకొని నవ్విరి. అప్పటినుండి నా భోజనపుష్టి గూర్చి యాసంగతి యెరిగిన వారిదివరకు నన్ను హాస్యము సేయుచుందురు.

ఒకనాడు మాయూరికి జేర్పననున్న మురగడామను గ్రామము కొబ్బరితోటలో బేరన్నయు నేను నా జట్టుదారుడు యోగియు కూర్చునియున్నాము. దీక్షితులను మాజ్ఞాతి యొకడు మమ్ములను జూచి "పుట్ట నిమ్మకాయలు దినుటకు వచ్చినారా?" యని చింత రువ్వతో మర్దించుచు గాళ్ల చేతులను గ్రుమ్ముచు చెవులుబట్టి మీదికెగవైచి క్రిందపడులోపున నరచేతితో వీపున జరచుచు మొదట యోగిని సత్కరించెను. మావాడుకదా మమ్ములను గొట్టునా యని నిబ్బరముతో మేమిద్దరన్నదమ్ములుంటిమి. కాని యాయవివేకి పేరన్నను గూడ యోగికివలె సత్కరించి చావచంపి చెవులుమూసి నాయొద్దకు వచ్చెను. "చూడు నీ చేతులు విరిగిపోవును. ననుగొట్టకు" అని తప్పించుకొని పారిపోతిని. మా తండ్రితో నీ సమాచారము చెప్పినాము. అతడు వానిని దలవాయు జీవాట్లు పెట్టెను. ఎంత సత్యవాక్కుడనో గాని మరి పదిదినములలో మమ్ముగొట్టిన యాదిభట్ట దీక్షితులు పనస చెట్టెక్కి పడెను. చేతులు రెండును విరిగి సొట్టయిపోయినవి.

మాపెద్దక్క పెద్దకుమార్తె మొదటికుమారుని పుట్టుటకు ఆ శిశువు తండ్రితో నన్ను జెప్ప బంపిరి. ఒక మంగలివాని సహాయముదీసికొని పిడిసీల నుండి సోంపురము గ్రామమునకు మధ్యాహ్నము రెండుగంటలకు బైలిదేరి పోవుచుంటిమి. నాకుబన్నెండేండ్ల వయసై యుండును. బుదతనపల్లి దారినిబోవుచు చిన్నచిన్న కొండగడ్డలు *(కొండవాగులు)* తాటితోటలు చిరుతుప్పయడవు లూళ్లు వలసలతిక్రమించుచు సాయంకాలమునకు కొరాము గ్రామమున కేగినాడ. వేదులవారు మా తండ్రి వంకచుట్టములచట గలరందులో. నాయింటి పేరు నాయూరు తెలిసికొని యొకముసలిపేదవాడ "కొడకా" యని నన్ను బిలిచి యాదరించి యన్నము పెట్టెను, అతడు తెల్లని చిన్నగావంచా కట్టుకొనెను. పేదవాడుగాని మర్యాదావంతుడు, సద్బ్రాహ్మణుడు. మరునాటియుదయమునకు సోంపురమునకు వెళ్లినాడ. మాపెద్దప్ప యింటిలోని వారు మూడుపూటలు నన్నుంచుకొని నాకు రెండు రూపాయలిచ్చిరి.

మా రెండవయన్న సీతారామయ్య విజయనగరములో తెలుగు ప్లీడరై శ్రీమంతుడై గంటి పట్టాభిరామయ్యయను తన మామగారియొద్ద గుమాస్తాగాయుండి యచ్చటనే కాపురముండెను. ఆ పట్టాభిరామయ్యగారు సిరిసంపదగల పెద్దకుటుంబి, విజయనగరము చెంగట సిరిపురమను గ్రామమన నా మూడవయన్న యత్తవారుండిరి. విజయనగరముదరి పిడిసీల యనుగ్రామము మాపెద్దక్కయత్తవారియూరు. సింహాచలయాత్ర చేసికొనుటకు, వీరకాంద్రవీరకత్తెలను[15] జూచుటకును అజ్జాడనుండి మా స్వంత బండికి గూడుకట్టి మా వ్యవసాయముకై గొన్న బలముగల గిత్తలను పూన్చుకొని, చిన్న చిన్న మజిలీలు చేసికొనుచు

**15. వీరకాంద్రు, వీరగత్తెలు** = వియ్యంకుడు, వియ్యపురాలు.

మా పెదతల్లులున్న బొమ్మికపాడు, కలవరాయి యనెడు గ్రామముల చుట్టపు విందులారగించి మా తలిదండ్రులు, సీతారామయ్యగారును నా పెద్దక్కగారును దక్క దక్కిన మాయమ్మ కన్నవారందరమును బయలుదేరినాము. కోమటిపల్లికి బొబ్బిలికి నడుమ పల్లము నందు బండియుండవిరుసులు మోయ, నెడమోరలు తప్ప దక్కిన భాగమంతయును మున్గిపోవునంత బాడిబురదలో నుండి యెద్లను విడిచిపెట్టి మాపెద్దన్న జగ్గావధాని యాబండిమొగను దానొక్కడే మొలబంటి రేగటిజిగట మంటిబాడిలో నండి యరక్రోసు మేర జూపరులబ్బురపడునట్లు భీమునివలె లాగుకొనివచ్చెను. బొబ్బిలిలో నొకదినముండి రామభద్రపురములో మాకు మిక్కిలి దూరబంధువులగు వడ్లమాని సుబ్బారాయుడు, లక్ష్మీనరస, న్నప్పలను సోదరత్రయము ఒకపూట యాదరింప ఆ రేయి చిమ్మచీకటిలో బయలుదేరి నడిరేయి కారికతోటయను కొండదారిన బడిపోవుచుంటిమి.

పూజువంటి పెద్ద యినుపకట్టలదుడ్డు బుజముపై వేసికొని గున్నటేన్గువలె మాపెద్దన్న బండి వెంటబడి వచ్చుచుండగా, పదిపదేనుగురు దొంగలు బండిని సమీపించియు బెబ్బులి గర్జనలతో బండినదల్చుచున్న మాపెద్దన్నను జూచి "యిదెక్కడి మనిషిరా కొండలాగున్నాడు" అని దారి యొసిలిపోగా "యేమిరా! బండి యొంటిగానున్నది. దొంగలు కాబోలు రండి రండి!" యని మా పెద్దన్న పల్కరించగా "బాబూ! మాకు బ్రాణములపై నాసలేదా"యని యాచోరులు బదులు చెప్పి పరుగిడిపోయిరి. మా పెద్దన్న యారడుగుల పొడవు, ఏనుగుతొండములవంటి చేతులు, సందిట నిమడని తొడలు, సన్నపు నడుము, భుజము మూపురముల నడుమ నించుమించు మూడడుగుల వెడల్పు వక్షము, మూడడుగుల చుట్టుకొలత గల బాహువులు నంతే పరిమితిగల గళము, పెద్ద వెడల్పైన మొగము, కర్ణములు, శిరస్సు, నేల సమముగా మోయు నేనుగుపాదములు, వేయేలయతని జూచిన వారందఱు నితడు గున్నటేనుగగాని నరునకింత విగ్రహముండునా యని యచ్చెరుపడు చుందురు. పదిమంది యొకవైపుపట్టి యెత్తిన దూలము తానొక్కడే రెండవవైపు పట్టుకొని నలువదియేండ్ల వయసుగల యతడనాయాసముగా నడచుట నెఱుగుదును. అతడు క్రమాంత స్వాధ్యాయవేత్త. ఉర్లాము పరీక్షలో నుత్తీర్ణుడు. భోజనమునకు తగిన విగ్రహ పుష్టి. విగ్రహమునకు దగిన యమానుష బలము, బలమునకు దగిన ధైర్యసాహసములు, బలపరాక్రమమునకు దగిన వైదికాచార సంపదయు నోర్పును గల సత్పురుషుడు. నవ్వులకైన నబద్ధమాడని సజ్జనుడు, అంత బలవంతుడైనప్పటికీ, నంతధైర్యశాలి యైనప్పటికీ, నంత సత్వగుణముకలవాడు జగములో మిక్కిలి యరుదు.

రామభద్రపురమున మధుపాడాగ్రహారములో మధ్యాహ్నము గడిపి, సాయంకాలమునకు మా పెద్దక్కయత్తవారియూరగు పిడిసీలకు వచ్చుచున్నపుడు, మొలబంటి

యేటి దొంగయిసుకలో[16] కూరుకొని కదలని యెడ్లతోడి బండిని మా పెద్దన్న బండి నొగలకును దనమొలకును బెద్దమోకు చుట్టబెట్టుకొని యొడ్డున నిలబడి సుళువుగ నొడ్డెక్కించుట నిజముగ నమానుష చేష్ట. పిడిసీలాగ్రహారములో నైదాఱుదినములున్న పిదప విజయనగరమునకు వచ్చి మాయన్న సీతారామయ్యగారి మామగారైన గంటి పట్టాభిరామయ్య గారి యింట దిగి నాల్గుపూటలున్న పిదప సింహాచల యాత్రకై పోయినాము. మాతో మాయూరినుండి వెట్టిప్పిగాడని యొకకాపు వచ్చినాడు. వాడు వెట్టిమొట్టి పాటలుపాడి నవ్వించుచు మార్గాయాసము మఱపించుచుండును.

## బాల్యదశా వర్ణనము

ఓహో! బ్రతుకులో బాల్యదశయే నిక్కముగా దివ్యదశ యనదగును. యౌవనమున్మత్త దశ, వార్ధకము పనికిమాలిన యొంటెత్తు దశ. బాల్యదశలో దేవాలయములందును, దేవతా విగ్రహములందును, దివ్యకథల యందును, బెద్దలమాటలయందును, నిక్కముగా నెంత నమ్మకముండును! "నానాటికి దీసికట్టు నాగంభట్టూ" అన్నట్లు క్రమక్రమమున నట్టి దివ్య విశ్వాసమును, మఱియట్టి దివ్యానందమును నశింపగా, రోగభూయిష్ఠ వేదనా కరమగు శరీరమువలె దుఃఖభూయిష్టమై శంకాస్పదమగును. మనస్సు వయసు ముదిరిన కొలది న్మిగులుచుండును. సకల జంతువులను, జెట్టుజేమలను సైతము మనుషుల వలె బల్కరించుచు, మాటాడుకొనుచుంట, సకల బదార్థములందు దేవతామూర్తి యన్నట్లు నమ్ముకొంట, శరీరమునకు దెబ్బతగిలినప్పుడు నొప్పి, శత్రులెదిరిపడినప్పుడు వెనుదీయని వీర మాకలి గొన్నప్పుడు తిండికై దేవులాడుట, తప్ప నితరమైన సంసార బాధ లెవ్వియును లేక నవ్యక్తానంద మనుభవించు పన్నెండేండ్లలోపు బాల్యదశయే నిజముగా బ్రతుకుయొక్క సారము. పుప్పిలేని పండువంటి బాల్యమును స్మరించుకొనుటచే గొంత మనస్సంతుష్టి, తక్కిన వయస్సులందు కొంత మనఃక్లేశమున కుపశాంతి కావించును.

## సింహాద్రియప్పన్న సందర్శనము

సింహాచలమెట్లు మొట్టమొదటిమా ఱెక్కుచున్నపుడున్న జోక *(ఉషారు)* యింతంతా. ఆకాశధార, గంగాధార, కాకిధార, పిచ్చుకధార, హనుమద్ఘట్టము, ప్రతిధార క్రింద నిలబడి తానమాడుచు, ద్రుళ్లుచు, నవ్వుచు, గంతులిడుచు, దలిదండ్రులు మొదలగు ప్రాణబంధువుల చెంత దనశరీరలాఘవ సామర్థ్యములగపర్చి బడాయిగ సంచరించుచు, గుంపుగుంపులుగా గొండలెక్కునపుడు మిక్కిలి శ్రమన్రోజుచు దిగునపుడాయాసమగపర్చు వివిధ యాత్రికుల

---

**16. దొంగ ఇసుక :** ఊబి లక్షణాలు కనబడకుండా సాధారణమైన ఇసుకనేలలాగా కనబడుతు అడుగువేస్తే దిగబడిపోయే ప్రమాదకరమైన ప్రాంతం. ఎండిపోయిన యేర్లు, నదీగర్భాలలో ఇవి ఉంటాయి.

నుల్లాసమున జూచుచు, మెట్టుమెట్టునకు బట్టలు పర్చుకొని నానావిధ వేషముల నడుగుకొను పేదల చెంత నొక్కొక్క గవ్వ[17] ధర్మము చేయుచు, సింహాచలమందు చిత్రింపబడిన ప్రతిదేవతా విగ్రహమునకు జేతులెత్తి మ్రొక్కుచు, దారికిరుప్రక్కల నరక్రోసులోతుగానున్న పర్వతపార్శ్వముల పూచి, కాచి, ఫలించిన, నానావిధ ఫలవృక్షమల గుంపుల కద్భుతపడుచు, మాపల్లెలో నెన్నడెఱుగని రాతిచప్పరములకును, వింతగోపురములకును, దేవాలయముల చిత్రములకు నబ్బురపడుచు, "స్వర్గమార్గమట్లు శ్రమకరము, తుదకిట్లానందదాయక" మని మెట్లెక్కుచున్నపుడు, కోవెల చెంతకేగినపుడు నగుమోమున నా తండ్రి పల్కుటచే సింహాచలము వలె స్వర్గముండునని నిశ్చయముగా నమ్ముకొనుచు, బులిహోర, కోవెలగారెలు, మొదలగునవి ప్రియముగా భుజించి, వంకకొప్పు, కప్పస్తంభము, గర్భ కోవెల మీదు క్రిందులయందలి వివిధ చిత్రములు, రాతిరథములను చూచితిని. లోనికి జనసమూహము మధ్య నిరికి యంతరాళమున జనసమూహముచే నడుపబడి, తుదకు గ్రిందబడి, గర్భకోవెలను జొరబడి, చెమ్మట గ్రమ్ముచున్నట్లు ఘర్మబిందువులు రాతి గోడప్రక్కలను స్రవింపుచుండగా, చందనముతో నిమిడియున్న వరాహనరసింహమూర్తి నేడు నిజరూపమని కొంత వంకమూతితోనున్న మూరెడుపొడవుగానున్న సింహాద్రి అప్పన్నను జేతులారా బుఱికి మ్రొక్కిమ్రొక్కి, జనుల నలుపులాట పెట్టక, ఘోరయుద్ధమున నెగ్గివచ్చినట్లు, చేబారలతో క్రొత్తేటి నీదివచ్చినట్లు, జన్మమీదేరినట్లు, స్వర్గముజూరగొన్నట్లు, సంతోషముఖవికాసములతో దేవుని సందర్శించుకొని కోవలనుండి మళ్లి యుత్సవ విగ్రహములను వేర్వేర దర్శించుకొని మ్రొక్కుచు, మూకమూకలుగా పసపుకుంకుమలు గంటమువ్వలచే నలంకరింపబడి యచ్చువిడిచిన మ్రొక్కుబడిగిత్తల వెంబడి దివ్వటులవంటి యగ్గిమంటల కోలల చమురుజల్లుకొనుచు నగ్గిజ్వాలలు తులసిపేరుల నెసగు గుండె లోరజేతుల ద్రిప్పుకొను మూఢభక్తిన్దాళములు తప్పెట్లు పట్టి దైవసంకీర్తనము చేయు శూద్రులును, నెనరుమాలి తమమునుకులకు దలాని, కత్తిపిడుల న్నెత్తులంగొట్టి బిగించుచు, మేటిగా శిరోజముల గొరిగి ప్రోగొనర్చు మంగళ్ల చెంత కుప్పకుప్పలుగా నున్న రాగిడబ్బులు, మంత్రములు చెప్పుచు స్నానమాడించి దక్షిణలకై చేతులుచాచు నీటికాసుబాపండ్రు, "నోహెూ! యేమి లయజ్ఞానమురా వీనిది? చూడు మెట్లుదరమునే మర్దలముగా వాయించుచు భజనము చేయుచున్నాడు" అని మా తండ్రి రెండు డబ్బులు బహుమతి యిచ్చిన యుదర వాదకునివిద్య

**19. గవ్వలు :** 1880 – 90 వరకు గవ్వలు చలామణిలో ఉన్నట్లు చెల్లపిళ్లవారు కథలు – గాథలులో సమాచారమిచ్చారు. డబ్బుకు నాలుగు దమ్మిడీలు. దమ్మిడీకి రెండు టోలీలు. లోహంతో చేసే నాణేలలో అతి తక్కువ విలువ గలది టోలీ. టోలీకి కట్టున్నర (12) గవ్వలు. పుంజీ అంటే నాలుగు, కట్టు అంటే 8 గవ్వలు. చిల్లిగవ్వ లేదు, గుడ్డిగవ్వకు మారదు అనే జాతీయాలు గవ్వల చలామణిని నిర్ధారిస్తాయి. నిర్మాణంలోనే లోపం ఉండేది గుడ్డిగవ్వ. పెంకు పగిలి రంధ్రం పడి మారకానికి పనికిరానిది చిల్లిగవ్వ. ఎటువంటి గవ్వలను మారకద్రవ్యంగా వాడేవారో!

ఆదాయమున మూడువంతులు వ్యయపర్చువాడను. అప్పుడపుడు గురునకై తప్ప మరెట్టి దుర్మార్గపు ఖర్చు చేసి యెరుగను. స్త్రీ వ్యసనముక్రింద నెన్నడు నొకదమ్మిడీయైన వ్యయ పర్చలేదు. దైవకృపవలన నిరువదేండ్ల వయసు నుండియు బైయాటలు కట్టిపోయెను. పరస్త్రీని మాతృవత్తుగ జూచుటయు ఆటపాటలవలనదప్ప నింకొక విధముగా నొకదమ్మిడీ యయిన సంపాదింపకుంటయు, మనుష్యులకు నేజేయు హరికథలు కృతి యివ్వకుంటయు, ప్రమాణపూర్వకముగ నబద్ధమాడకుంటయు, జీవహింస చేయకుంటయు, నానియమములు. పరమేశ్వరుడు నిరాటంకముగ నావ్రతములను గొనసాగించుచుండెను. నా మతము.

**చం॥ కలయందెత్తెడు మేను దోచెడి జగత్కార్యంబులుం జిత్తసం**
**చలత న్వాస్తవ మందుపోల్కిగనుడీ సర్వ ప్రపంచంబు న**
**జ్ఞులకు న్నిక్కముగాగనంబడును బ్రాజ్ఞు ల్పూర్ణభావంబు ని**
**శ్చలమౌట న్దమకన్న వేరు గన రీశత్వంబు బ్రాపించుచున్.**

అనియు ననగా మనఃకల్పిత మీదృశ్యమంతయుగాని వాస్తవము కాదని ప్రస్థానత్రయము[13] మొదలగు వేదాంతగ్రంథములు జూచుటచే దృఢవిశ్వాసము కలిగెను, గాని రూపమున కెల్కగాని చేయునవి పందికొక్కు చేష్ట లన్నట్లు విశ్వాసమునకు దగు వైరాగ్యము మాత్ర మబ్బలేదు. తత్వజ్ఞానమే మాత్రమును లేదు.

## విజయనగరము మహారాజు వారి వద్ద నా ప్రస్తావన

తొమ్మిదేండ్ల వరకు ఖైదులోనుండి వచ్చిన యొకవెలనాటినియోగి (లింగం లక్ష్మాజీ పంతులు) విశాఖపట్టణమున నా కథలు విని నాయందు దయకలవాడగుటచే దనకు మహారాజుగారికి గురుశిష్య సంబంధముచే మహారాజావారితో నన్నుగూర్చి సిఫార్సు చేసెను. మహారాజావారు నన్నుజూడగోరిరి. ఒకనాడు దివాన్సాహెబుగారి యల్లుని యింట నాచు రంగు జరుగుచుండగా నాయందు గావేషిగల దర్బారువైణికుడు నన్నుజూరి "యోయి; నిన్నటి రాత్రి మహాప్రభువు వారి యొద్ద నీ ప్రస్తావనము వచ్చెను. హరికథ కొంచెము తెల్వితేటలుగా చెప్పగలవని నిన్ను గూర్చి మహారాజుగారితో మన్వి చేసినాను" అనియె నందుకు "సరియే బాగున్నది" అంటిని. అందుపైనతడు "నీయోగ్యత కొలది చెప్పినాను. ఫలానాయతనికంటె నెక్కువుగ గవిత చెప్పగలవని యనమన్నావా లేక ఫలనావానికంటె నెక్కువుగ వీణ వాయించగలవని సిఫార్సు చేయమన్నావా?" యని యీసడింపుగా బల్కె నందుపై జిరునవ్వుతో "అయ్యా! ఫలానాయతనికన్న సొగసుగ గవిత్వము చెప్పగలననియు ఫలానావానికన్న నెక్కువుగ వీణ వాయించగలనని నేల మన్విసేయలేదు" అంటి నందుకు తలపంకించి యత దూరకొనెను.

---

13. బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీత ఈ మూడింటిని ప్రస్థానత్రయం అంటారు.

## మహారాజా వారిని దర్శించుట

మరునాడు మహారాజుగారి *(ఆనందగజపతి)* సెలవైనదని కోటనుండి నాకు వర్తమానము వచ్చెను. నేనుచితముగా డ్రస్సు వేసికొని చేత నొక కొబ్బరికాయ పట్టుకొని[14] మహారాజు సముఖమున కేగినాడ. ప్రత్యుత్థాన పురస్సరముగ నన్నాదరించుట కిచ్చగింపక తా ముందుగా గూర్చుని పిదప నన్ను గూర్చొమనుట కిష్టములేక సముచితజ్ఞులయిన ప్రభువువారు సభకు వెళ్లినతోనే తాము సభకు దయచేసి నన్ను గూర్చుండుమని యభిమంత్రణ మొనర్చి తాముపవిష్టులైరి. పిదప ప్రభువు వారికి నారికేళఫలమును సమర్పించి

**గీ॥ అశ్రితులపాల దాక్షి్య మరులయొద్ద**
**శౌర్యముం గోవిదులచెంత సాత్వికతయు**
**నెసగు నేలినవారి కభీష్టజయము**
**లిచ్చుగావుత సంతత మీశ్వరుండు**

అని యాశీర్వదించి కూర్చుంటిని. పిమ్మట మహారాజావారు నాతో నింగ్లిషున "అయ్యా! మిమ్ముగూర్చి మెడ్రాస్ మెయిల్ నందలి యార్టికిల్చూచి చాలా సంతోషించినాను" అని సెలవిచ్చిరి. పిదప నెద్దియైన నొకపద్యము నాకవిత్వము మచ్చు చూపించుటకై నాకు సిఫార్సు చేసిన పంతులు చదువమనియె. అపుడు విక్టోరియా రాజ్ఞిపై నే జెప్పిన పద్యమును చదవినాడను. ప్రభువువారు మిక్కిలి సంతోషించి యాపద్యము రెండుమార్లు తిరిగి చదివించి సభికులతో "నాహా! వీరి కవిత్వ మెంత మధురముగా నున్నది! విన్నందుకు గన్నందు కొకలాగున్నది. రాగజ్ఞానముకూడ శ్లాఘనీయముగా నున్నది" అని సెలవిచ్చిరి. పిదప నే సంతోషముతో వారిపై జెప్పిన శుద్ధసావేరీ వర్ణమును బాడినాడ నదివిని "యింత ప్రశస్తమైన సంగీతజ్ఞానముగూడ వీరికున్నదని యిదివరకు నాకెవ్వడును జెప్పలేదు? సంగీతసాహిత్య ప్రజ్ఞలు నిరుపమానముగ నున్నది. కనుకనే యింత ప్రసిద్ధి వచ్చెను" అని ప్రభువు వారు సంతోషించి నాతో "మీ జన్మభూమి యెద్ది? మీరెచ్చట విద్య నభ్యసించినారు." అని యింగ్లీషున సెలవిచ్చిరి. అందుకు "మహాప్రభూ! యేలినవారి తాలూకాలో జేరిన యజ్జాడ నా జన్మస్థానము, మరియు నేలినవారి కాలేజీలో జదువుకొంటిని" అంటిని. "అందుకు నాకు గర్వముగ నున్నది" మహారాజువా రుప్పొంగుటకు నాకెంతయో హర్షమయ్యెను. పిదప వారిపై నే రచించిన భైరవి, ధన్యాసి స్వరజతులను బాడి నాటకురంజిస్వరజతి

---

**14. కొబ్బరికాయ పట్టుకొని** : రాజు దగ్గరకు వెళ్లేటప్పుడు వట్టిచేతులతోకాక ఏదోఒక కానుక తీసుకువెళ్లడం ఆచారం. బ్రాహ్మణ ద్రవ్యం గ్రహింపరానిది కనుక ఏదైనా పండుకాని, కొబ్బరికాయ కానీ తీసుకువెళతారు.

పాడుచుండగా గొంతవరకు విని సభనుండి లేచిపోయి తిరిగి పెద్దగురుకటాక్షమున జోగుచు వచ్చి నాచెంత గూర్చుని "యాగుమాగుమ" అని గద్దించుచు నాపై గావేషి వహించిన ముసలి వైణికుడు కోపముతో నన్ను జూచి "నిన్న నేమంటిమి? నీతో సమానముగ గవిత చెప్పగలవారుగాని వీణవాయించువారుగాని యిచ్చట లేరంటివి కావా?" యనె నతనికి బ్రత్యుత్తరమిచ్చుట కిచ్చగింపక నే నూరకుంటిని, అంతబోక యావైణికశిరోమణి కనుల నిప్పులు రాల్చుచు "నీ వట్లనలేదని యీ వీణ పట్టుకొని ప్రమాణము సేయుము" అని చెంగటనున్న ప్రభువువారి వీణ నాయొద్దకు ద్రోసెను. అంత ప్రభువు వా రతనితో "ప్రమాణము చేయవలయునా యేమి? అట్లనియుండవచ్చు నెవరి ప్రజ్ఞ వారిది. రామాయణములో బిడకల వేట్లాటవలె మధ్య నీ పోట్లాట యెందుకు? అబద్ధమాడుట కిష్టములేకత దూరకొన్నాడు" అని నా వైపు జూచి-

కం॥ కులశైలంబులు దలకిన
జలధులు నింకినను సూర్యచంద్రుల సన్మం
డలములు నేలం దొరగిన
పలుకడబద్ధంబు సత్యవాది గుణనిధీ"

యని చదివి "నే రచించినాడ దీనిని" అని సెలవీయగా వెంటనే యా పద్యమునే జదివి "సొగసుగ నున్నది పద్యము" అంటిని[15]. నాయేకసంధాగ్రాహిత్వమునకు మహారాజుగారు మిక్కిలి సంతోషించి "యిట్లొకసారి విని పద్యము తిరిగి చదువుట మిక్కిలి దుర్ఘటము" అని శ్లాఘింప మరింతయుడికి యావైణికసార్వభౌముడు "మహాప్రభూ! వీడు మిక్కిలి పొగరుబోతు. వీనికి బుద్ధి చెప్పవలయును. రావణాసురుని వలె మా బోంట్ల వీడు బాధించుచున్నాడు" అని నా వైపు దిరిగి "యోరీ బేవఖూఫ్ చూడు నిన్నేమి చేసెదనో" యనియె. నందు కసహ్యముతో నప్పండితోత్తమునకు మారుబల్క నుద్యుక్తుడనగు నన్ను నా ప్రక్కనే కూర్చున్న కాలేజీ ప్రొఫెసరు వంగ మాధవరావు నాయుడుగారు[16], నాకు సిఫార్సు చేసిన పంతులు తమ హస్తాగ్రంబుల జాటుగా నా వీపు స్పృశించుచు "నుపేక్షింపుము, మారుపల్కవద్దు" అని సంజ్ఞ చేయుచుండిరి. నాడు రాజసభలో

---

**15.** వెంటనే దాసుగారు ఆశువుగా ఈ పద్యం చెప్పారట.

ఆనంద గజపతీంద్రున, కే నరులున్ సాటిగాంచ రీవిన్ రీవిన్
గానకవితా ప్రవీణత, ధీనయ బలరూప సంగతిన్ పితృభక్తిన్

(బులుసు వెంకటరమణయ్య వ్యాసం-ఆనందగజపతీంద్ర సపాద శతజయంతి ప్రత్యేక సంచిక-1977)

**16. వంగ మాధవరావు నాయుడు** : విజయనగరం మహారాజా కళాశాల వైస్‌ప్రిన్సిపల్‌గా, గణితశాస్త్ర ప్రొఫెసర్. 1912లో పదవీ విరమణ చేశారు. పత్రికారంగంపట్ల మక్కువతో 'తెలుగు హార్పు' అనే వారపత్రికకు సంపాదకునిగా పనిచేశారు. గురజాడ అప్పారావుగారికి అత్యంత సన్నిహితుడు.

దర్బారుపండితులు కోటయిలాకా గొప్పయుద్యోగులెల్ల యుండిరి. నేనెట్లు మహారాజ సమక్షమున బాడెదనో యని పలువురు గుమిగూడి సభ చాటున నుండిరి. పిదప ప్రభువు వారు నా ప్రతికక్షిని జూచి "యోయీ! చాలు నూరకొమ్ము. రసముగా బాడుచుండగా నీయల్లరి యెందు కతడు స్వతంత్రుడు. మైసూరు మహారాజుగారిచే ప్రజెంట్లు పొంది దేశములు దోచి జీవించుచున్న యతనికి మనబోంట్లు లక్ష్యమా?" యనియె. పిదప పెద్దగురుని వశమున నేడ్చుచు నావైణికోత్తముడు "సరియా, మహాప్రభూ, మీరిట్లు వీని తరుపున మాట్లాడినచో వీనికి మరింత గర్వము హెచ్చును. వీడు చోడవరములో నా బంధుమండలిచెంత నా కవిత్వమును దూషించినాడు. పైనెక్కడనైన సభలలో మేము పనిచేయుచున్నప్పు డడ్డుపడి శృంగభంగముగా మాట్లాడుచుండును. ఏలినవారి సమక్షమున వీడైన నుండవలయును. నేనైన నుండవలయును గాని యుభయులముంట యికమీద జతపడదు" అనియె. అపుడు నే నా వైణికునితో "అయ్యా! మీరు తండ్రివంటివారు. సర్వజ్ఞులగు ప్రభువుల యెదుట నెద్దియో లేనిపోని క్రోధము వహించుకొని యిట్లాడుట ధర్మము కాదు" అంటిని. పిదప మహారాజు గారు సభ చాలించిరి. ఎవరి మట్టుకు వారిండ్లకేగినారము.

## దర్బారులో విద్వాంసులు ప్రభువు వారితో నాపై మన్విసేయుట

కోటలోని సంగీతజ్ఞులందరు గట్టుకట్టి నాకేమియు సంగీతజ్ఞానము లేదనియు సాహిత్యజ్ఞులందరు నాకేమియు సాహిత్యజ్ఞానము లేదనియు నదివరకు మహారాజుగారితో జెప్పుచుండిరిగాన దమమాట నిర్వహించుకొనుటకై ఛిద్రములు వెదకి నన్నాదనిపించుటకు నిశ్చయించుకొనిరి. తమ్మనుసరించి తిరిగినచో నడుగున ద్రొక్కుట, నిర్లక్ష్యముగ నున్నయెడ విరోధించి యెగ్గుసేయుట, యీ పండిత సమాజముయొక్క నైజమని పోల్చుకొంటిని. ఒకనాడు నాకు సిఫార్సు చేసిన పంతులుపై నొకసీసపద్యము చెప్పినాడను. అతడు మిక్కిలి సంతోషముతో మహారాజుగారి కాపద్యము చూపెను. ఆ పద్యములో దప్పున్నదని పండితులు ప్రభువు వారితో మన్విచేసిరి. నాయందు గావేషి గల వైణికుని మొగమాటమున నన్ను బిలిపించుకొంట మానుకొన్న ప్రభువు వా రాపద్యమును నావలన విని నా సాహిత్యము పరీక్షింపగోరి నన్ను బిలిపించిరి.

నేను దర్శనమునకు వెళ్లినతోనే ప్రభువువా రింగ్లీషులో నాతో "అయ్యా! మీ వంటి గొప్పకవిని నేనిదివరకు జూడలేదు. మీరు తత్త్వజ్ఞులు. మీ సంగతి కేవల సాహిత్యజ్ఞులుగాని కేవల సంగీతజ్ఞులుగాని ఇంగ్లీషు విద్య తెలియని యుభయజ్ఞులుగాని యెరుగజాలరు. ఈ పండితుల అసూయను మీరు లక్ష్యము సేయవద్దు. ఏదీ

పండితులుగారిపై చేసిన పద్యము చదువుడు" అని సెలవిచ్చిరి.

**సీ॥ అఖిల లోకవ్యవహార ధర్మంబుల**
**నడిపింప జాలిన నల్లవేల్పు**
**జగము పైనొరిగియు జలియింపని ఘనుండు**
**వానగాలులకు బర్వతముబోలి**

యని చదువుచుండగా "ఆగుడు, త్వార్థకము భిన్నకర్తృకముగా బ్రయోగించినారు కదా యందుకు లక్ష్య మగపర్చెదరా లేక తప్పని యొప్పుకొనెదరా?" అని సెలవిచ్చిరి. అందుకు "మహాప్రభూ! త్వార్థకము భిన్నకర్తృకముగా నుండుటకు లక్ష్యమగపర్చెద నొక గంటలో మన్వి చేసెదను" అంటిని. "అక్కర లేదు సావకాశముగా మీరు లక్ష్యము కన్పర్చ వచ్చును" అని నానాంశములపై నే రచించిన పద్యములు చిత్తగించుచు నొక వైష్ణవకవి శిరోమణిని[17] జూచి "స్వామీ యెట్లున్న దితని కవిత్వము" అని సెలవివ్వగా నక్కవిసార్వభౌముడు తలయూచి "మహాప్రభూ! ఈతని తెనుగు కవిత్వము విజయవిలాసకారుని కవిత్వము వలె నిరూపమానముగ నున్నది. సంస్కృతమెట్లుండునో?" యనియె అపుడు ప్రభువు వారు నాతో "మీరుభయభాషలలో నిరుపమానముగ గవిత చెప్పగలరని బ్రహ్మణ్యులైన రామానుజాచార్యులు గారు చెప్పిరి. ఏదీ మీ సంస్కృతపద్య మెద్దియైన జదువుడు" అని సెలవిచ్చిరి. అపుడు

**శ్లో॥ న సా జయతు శూన్యవాక్ తవ మమేవ సంతాపయుక్**[18]

అని నేరచించిన శ్రీకృష్ణజననము సంస్కృత యక్షగానములోని వసుదేవుడు కంసునితో నన్నవాక్యము జదువుచుండగా "తవచ మమేవచ సంతాపయుక్" అనియన్నచో బాగుండునని వైష్ణవ కవీశ్వరుడనగా "స్వామీ యిదివరకు సంగీతమున వైణికశిరోమణి గారొక చకారము పెట్టిరి. కాని కవిత్వమున దాము రెండు చకారములు పెట్టుట మరింత వింతగా నున్నది. తమ దిద్దుపాటు తెల్వి మిక్కిలి శ్లాఘ్యము" అనగా ప్రభువు వారు ప్రక్కలు పట్టుకొని నవ్వుచుండగా కవిస్వామి తెల్లపోయెను.

పిదప ప్రభువువారి సెలవందికొని వైష్ణవకవియు నేనును గలిసి మేడదిగి వచ్చు చుండగా, నే మహారాజు గారి సమక్షము నుండగా రానుత్సహింపక క్రింద గనిపెట్టుకొన్న

**17. వైష్ణవకవి శిరోమణి :** ముదుంబై నరసింహాచార్యస్వామి అయి వుండాలి. సంస్కృతాంధ్ర భాషలలో పండితుడు. వివిధ ప్రక్రియలలో అనేక గ్రంథాలు రచించారట. వీరి పాండిత్య ప్రకర్షకు ముగ్ధుడై యువరాజు ఆనందగజపతి తన తండ్రికి సిఫారసు చేసి అస్థానపండితుడిగా చేర్పించారు. 1930లో మరణించారు.

**18. నసా జయతు.... :** నానుండి శూన్యవాక్కులు రావు. తమకు జయము కలుగుగాక.

వైణికశిరోమణి నన్ను జూచి "యోరి తమ్ముడా! పూర్వము సంగీత సాహిత్యముల ప్రసిద్ధి గాంచిన శిష్టు కృష్ణమూర్తి వలె నీవసమాన ప్రతిభ కలవాడవని నే నెరుగుదును. దండెపట్లు పట్టగలవా?" యని పెద్దగురునివశమున జోగుచు నన్ను జెయిపట్టుకొని లాగ జొచ్చెను. అతదు మిగులబలాఢ్యుడైనప్పటికి వివశుడై యుంటచే నే మెలపున దప్పించుకొంటిని. పిదప వైష్ణవ కవిశిరోమణి నాతో "అయ్యా! మీ కవిత్వము వంటి సొగసైన కవిత్వ మిదివరకు నే జూడలేదు" అనియె. అపుడతనితో "అయ్యా! యీమాట మహారాజుగారి యెదుట చెప్పిననెంత బాగుండును" అంటిని.మా కుడ్డీదారుల సంతోషపెట్టుటకై మిమ్ము బాహాటముగ మెచ్చుకుంటిని" అనియె నపుడు నాలో నే "నాహా! యింతటి వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు కూడ సత్యమాడనొల్ల కుంట కలిమాహాత్మ్యము" కాబోలనుకొంటిని.

## మరునాడు మహారాజులుంగారి దర్శనమునకు బోవుట

మరునాటికి మనుచరిత్రములో క్త్వార్థము భిన్నకర్తృకముగానుంట కుదాహరణము వెదకినాడ. మరియు భారతములోగూడ నొక లక్ష్యము దొరికెను. కోటలో వీణలగదియొద్ద బండితు లుందురు. "నృమాంసంబు కూడ యేనెట్లు భరించువాడ" నని మనుచరిత్ర మందలి యుదాహరణమును, "రాహుకంఠముతెగి దేహము ధరణి బడియె" నని భారత లక్ష్యమును గన్పర్చగా మహారాజుగారు పండితులందరియెదుట "నారాయణదాసు గారి సాహిత్యము ప్రశస్తమైనది" అని ప్రశంసించిరి. పిదప వీణావాద్యమున ద్రుతకాల విశారదుడును వైణికగురుప్రపౌత్రుడు నగు నొకనాయిాడు వైణికునకు నాకు జోడిచేసి మరునాడు వీణ వాయింపించెదమని ప్రభువువారు సెలవిచ్చిరి. కాని యావైణికు డెందుచేతనో గాని పదేనుదినములవరకు గోటకు రాలేదు. బహుశా నాతో బల్లవి వాయించుటకు జంకెను గాబోలును. మరియారునెలల వరకు మహారాజుగారి సభకు నేబోవ తటస్థించ లేదు. అంతట నాతోగలహించిన వైణిక శిరోమణి కాలధర్మమందెను. మరి నాలుగుదినముల పిమ్మట మహారాజుగారు నను బిలిపించి యాశుధారగా "మానము ప్రేమ లజ్జయును మాటికి బోరగ బ్రీతి మీరెడున్" అను సమస్య యిచ్చి పూర్తిసేయుమనిరి. వెంటనే

**ఉ॥ సానులయొద్ద నిచ్చకముసల్పుచు లొంగుచు నుంట కర్థమౌ**
**దానము సేయకుంటకు వృథాదినము ల్సరిపుచ్చుకొంటకున్**
**జ్ఞానియు జాణయైన తననాథుని గన్గొనునప్డు భార్యకు**
**న్మానము ప్రేమలజ్జయును మాటికి బోరగ బ్రీతి మీరెడున్**

అని చదువగా నభ్రమంది నన్ను జూచిరి.

## టౌనుహాలులో మహారాజులుంగారిని దర్శించుట

ఒకనాడు కోటకు బోవుచుంటిని. భాగవరపు సూర్యనారాయణయు, కాకినాడ పంతులను నింకొకయతడును గలిసి గుఱ్ఱపుబండిపై నుండి కోట పడమటి ద్వారమార్గమున బోవుచుండగా నెచ్చటికి దయచేయుచున్నా రేమి వింత లని యడిగినాడ. అందుకు సైరు బోవుచున్నామని చెప్పిరి. మహాప్రభువ్వారు కోటలో లేకుంట తెలిసికొని నేనుగూడ గోటపడమటి ద్వారమున బోవుచు టౌనుహాలులో[19] మహారాజుగారి జాయంటు మేనేజరుగారికి "దివాన్ బహద్దర్" టైటిలిచ్చినందుకు సభ చేసిరన్నమాట విని యట కేగినాడను. నన్ను గాంచినతోనే నమస్కరించి ప్రభువువారు తమచెంగటి కుర్చీపై కూర్చుండుమని సెలవిచ్చి దొరలను దొరసానులను నాదరించుచుండిరి. అంతట దూరముగనున్న భాగవరపు సూర్యనారాయణ నన్ను సభనుండి లేచిరమ్మని పిలుచుచుండెను. నే వినిపించుకొన కుంటిని. అది విని ప్రభువు వారు "ఏమది మిస్టర్ నారాయణదాస్" అని సెలవీయగా "వాడు నన్ను రమ్మని తొందర బెట్టుచున్నాడు" అని యంటిని అపుడతనితో "నారాయణదాసుగారితో నేడు నాకు బనియున్నది" అనిరి. పిదప సూర్యనారాయణ, కాకినాడ పంతులు మొదలగు కోటయుద్యోగులందరు నిండ్లకు బోయిరి. మహారాజును వారి ప్రైవేట్ సెక్రటరీయగు నొక యురోపియను మరియిద్దరు ముగ్గురు చిల్లరి గుమాస్తాలును కొందరు ప్యూన్లును నేను మాత్రమే మిగిలియుంటిమి. రాత్రి యెనిమిది కావచ్చినది. అపుడు ప్రభువు వారెంతో యనుగ్రహ పూర్వకముగా నాచేయి పట్టుకొని ప్రైవేటు సెక్రటరీతో "మనయందరి కొక్కకన్నే యున్నది కాని యితనికి రెండు కన్నులున్నవి. సంగీత సాహిత్యముల నిరుపమాను డీయూర నితనివలె సొగసుగ గవిత్వము చెప్పగలవారు కాని సంగీతజ్ఞులు గాని లేరు" అని నాతో "ఈ దొరగారు తెనుగులో ప్రొఫెసర్లు" అని నుడివి రందు "కాలాగునా" యని యాశ్చర్యముతో దల యూచితిని.



విజయనగరం సంగీత కళాశాల

---

**19.** టౌను హాలు : ఈ భవనంలోనే తదుపరి దాసుగారు ప్రిన్సిపాల్‌గా సంగీత కళాశాల ప్రారంభమైంది.

# నా మాట

అజ్జాడ నా పుట్టు - నట్టు కుప్పమ్ము
నా తలిదండ్రులు - నరసమ్మచేన్లు

ఆది భట్లుంటి పే - రయ్యవార్లేను
పదువుకా భర - ద్వాజుడె మొదలు

నాల్గేండ్ల యీడున - నాకెల్ల చదువు
లబ్బెదమంతనే - నరసిన కొలది

నాటపాటలమేటి - ననిపించుకొంటి
నా కెదుర్లేదికే - నాడులనైన

వేవేల మందికి - వినుచునాగొంతు
గజ్జి విప్పెదరేయి - కడముట్టబాడి

యందగాంద్రతలక - ట్టందురు నన్ను
ఎకిమీంద్రకానుక - లే గొన్న వాడ

దోడాలమైసూరు - దొర నాకు వేసె
నాకంకినీడు పెం - దేరమ్ము దొడగె

గైకొందు నెలకు రొ - క్కము నూఱువిజయ
నగరేలుగొప్పతే - ం‌డ్ల నెనరువలన

పారసి, వేలుపు - పలుకింగిలీసు
తెలుగు వ్రాసిచదువు - తెలివి నాయాస్తి

నాయన్న పేరన్న - తెలివి నా చిన్ననాటి
నుండియున్గలిసినే - నున్నాడియాడి

యింతకదాకనుకట్న - మెలమిగొనెదము
పదునాలుగేండ్ల పై - బడియింగిలీసు

మొదలిడినే ఎప్పే - ముగియించినాడ
పదునెన్మిదేండ్ల - సర్వము మొదలాట

పాటమాటలబట్టి - బ్రతుకుచున్నాడ
కన్యాకుమారి క - ల్కత్తావఱకు

నఱవ, కన్నడి, మల - యాలి, బంగాలి
తెలుగుసీమల మెప్పు - తెచ్చికొన్నాడ

ఈవికాంధ్రదప్ప - నెవ్వరేని
చీరికిన్గానమంచి - చెప్పెడిపట్ల

నాయంతనేర్చితి - న్జదువులనెల్ల
నాయద్దులొత్తివం - దలుమను చంద్రు

ఇంచుమించిపుడెబ్బ - దేండ్లు నాయీడు
గాని యిప్పటికినే - గట్టిదన్గజ్జె

నలుమాటలల్లువాం - ద్రన్నాటిమీఱ
హరికథామృతము కై - యాము తారకము

కలగల్పు తెనుగుగా - కాళిదాస్సేక్స్పి
యరుల యందములు ప్రహ్లాద మొదలుగ

బదకొండు హరికతల్ - బాటసార్యార్య
సత్యవ్రత, ముకుంద - శతకముల్మాదు

సారంగ నాటక - చ్చతెలుగుతోడ
నూర్గంటి వేలుపునుడి - పెరుమాళ్ల

వెయిపేర్ల వినకరి - పెద్ద మొక్కుబడి
విడిసీమతెలుగున - వేలుపునంద

గౌరు పెండిలియు మ - ర్కయ్క చౌకట్లు
తరుణముకొలది నా - డబ్బులెన్నెన్నో

కలిగి నెత్తురు - గంటి యేడాది
తూపు చుక్క నెలయం - దున బూదెరేయి

పదికంగులకునెల - పట్టుతోయమున
నేచదువులనై - న తెన్నువారి

కన్నగన్నాకు - లెక్కడనైనలేదు
తనుతా బొగడుకొంట - తన్నకున్నట్లె

ఊపిరిపైదీసి - యున్నంతవఱకు
నా తలవంపుల - న్జాటుకోలేను

నా తప్పులన్గాచు - నాయిలువేల్ప
మగయాడు పెండ్లిండ్లు - మానుకోవలయు

వేలుపు నుదువుల - న్విడనావలయు
పొత్తుగానెల్లరి - మ్మ్రగమనవలయు

నాయింపువ్రాతలు - వదలుకోవలయు
మై వంచి యందఱుం - బాట్పడ వలయు

ముది, పిన్న, యవిటుల - బ్రోవగా వలయు
నాయైపులన్గాచు - నాయిలువేల్ప

మానక పెండ్లిండ్లు - మానుకోవలయు
నంజుడు, త్రాగుడు - న్మానుకోవలయు
నా మాటలను విని - నన్మేలు గలుగు.

*(డెబ్బైయేళ్ల వయసులో దాసుగారు ద్విపదలలో క్లుప్తంగా చెప్పిన స్వీయ చరిత్ర)*

దాసుగారి ఉమర్ ఖయ్యామ్ అదొక అపూర్వమైన కృషి. గ్రంథానికి దాసుగారే ఇంగ్లీషు, సంస్కృతం. అచ్చ తెనుగులలో ఉపోద్ఘాతం వ్రాసుకున్నారు. పీఠిక వ్రాస్తూ రాధాకృష్ణ పండితుడు "ఐవజ్ గ్రేట్‌లీ స్ట్రక్ బై హిస్ వేరిడ్ టాలెంట్స్, రిమార్కబుల్ లింగ్విస్టిక్ ఎక్విప్‌మెంట్ అండ్ టెక్నికల్ పవర్ ఆఫ్ వెర్శిఫికేషన్" అని శ్లాఘించారు. పత్రికలు, పండితులు, ప్రముఖులు దాసుగారి ఉమర్ ఖయ్యామ్ అనువాదాన్ని వేనోళ్ల కొనియాడారు.

బార్డ్సువెల్ దొర 1939 ఫిబ్రవరి 2వ తేదీన వ్రాసిన లేఖలో నోబెలు బహుమానం గురించి ప్రస్తావించి దానిని పొందటానికి దాసుగారు నిజంగా అర్హులని రాశారు.

**జి. రామకృష్ణ**

అనుబంధం - 1

# హరికథ

**ఆదిభట్ల నారాయణ దాసు**

**ఆ**స్తిక్యమును ధర్మాధర్మములును సర్వజన మనోరంజనముగ నృత్య గీత వాద్యములతో నుపన్యసించుట హరికథ యనబరగు. అట్టి యౌపన్యాసికుడు కథకుడనబడును. దైవభక్తియు సత్యము భూతదయయు హరికథ యందలి ముఖ్యాంశములు. దేవుని గొల్చి తరించిన ప్రహ్లాదాది పరమ భాగవతుల చరిత్రములును సావిత్రీ ప్రముఖ పతివ్రతా చారిత్రములును హరిశ్చంద్రాది వీర చరితములును దెల్పినచో మంచి యభివృద్ధి యగునని వాల్మీకి వేదవ్యాసుడు మొదలగు మహర్షులు కావ్య పురాణేతిహాసంబుల బన్నిరి. నారదుడు దొట్టి పరమ మునులు భగవన్నామ సంకీర్తనము సేయుచు నాడుచు బాడుచు లోకులందరింపజేసిరి.

**శ్లో॥ వీణావాదన తత్వజ్ఞో శ్రుతి జాతి విశారదః**
**తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి॥**

అను యాజ్ఞవల్క్య స్మృతివచనానుసారముగ యోగముచేతను సంగీతము చేతను దక్క వేరు మార్గమున మోక్షము సాధింపరాదనియు యోగముకన్న నిరపాయమగు సంగీతావలంబనముచేత,

**శ్లో॥ గాయం శ్చరిత్రాణి రథాంగపాణేః నృత్య న్నిరస్తాఖిల కర్మబంధః**
**నిరంకుశ స్సర్వసమో విరాగీ కైవల్య మభ్యేతి ముకుందభక్తః॥**

అను నారద స్మృతి ప్రకారము సర్వ వస్తువులయందు వాసుదేవభావనచే మనోవాక్కాయ కర్మములచే దేవుని భజించుచు సర్వజనులకు దైవభక్తిని బోధింపదగు మోక్షసాధనము సంగీతముకన్న వేరులేదని రూఢిగ దెలిసిన పురందర విఠ్ఠలాది వాగ్గేయకారు లిక్కలి యుగమున గీత ప్రబంధములు విరచించి యాడుచు బాడుచుం బరుల దరింపచేసి తాము తరించిరి.

**శ్లో॥ తస్య గీతస్య మాహాత్మ్యం కే ప్రశంసితు మీశతే**
**ధర్మార్థ కామమోక్షణా మిద మేవైకసాధనమ్॥**

అను శాస్త్రమునుబట్టి వాగ్గేయకార సత్తముడగు వాల్మీక మహర్షి శ్రీమద్రామాయణమను గీత ప్రబంధ మొనరించి కుశలవులచే జగదాహ్లాదకరంబుగ త్రేతాయుగంబున బాడించెను. భరతముని ప్రముఖుల నాదికాలమున "శివస్తుతౌ ప్రయోజ్యాని మోక్షాయ విదధే విధిః" అని బ్రహ్మ రచితములగు మద్రకాది గీతములను శివసన్నిధిం బాడిరి. కలియుగమునందు

ప్రాచీనులలో సుప్రసిద్ధులగు వాగ్గేయకారులు జయదేవుడు గీతగోవిందమును, నారాయణతీర్థులు శ్రీకృష్ణలీలా తరంగములును, దీక్షితులు కృతులును విరచించిరి. ఆంధ్ర భాషయందు గూడ క్షేత్రియుడు, రామదాసు, త్యాగరాజు, సుబ్రహ్మణ్యకవి, గోగులపాటి కూర్మన్న మొదలగు మహానుభావు లుభయ తారకముగ గీత బంధముల గావించి ప్రఖ్యాతి వడిసిరి. కొద్ది కాలము నుండి మహారాష్ట్రము మొదలగు పెక్కు దేశంబులలో సంగీత సాహిత్య విశారదులు కొందరు జీవనార్థమై కథకవృత్తి నవలంభించి హరిభక్త వేషంబుల ధరించి దైవభక్తిని ధర్మాధర్మములను జనులకు బోధించుచు పౌరాణికులు కథకులు భాగవతులు, దాసులు మొదలగు సంజ్ఞలం బరగుచున్నారు.

**శ్లో॥విష్ణుభక్తా ఏవ విప్రా నానావేదవిదా అపి**

యను స్మృతివాక్యము చొప్పున సూతాది కథకులం దలంచి బ్రాహ్మణేతరులు గూడ కథకులై యుచిత సత్కారములు వడయుచున్నారు. హరికథా శ్రవణము వలన శ్రోతలకు నిఖిల శ్రేయోభివృద్ధియగును. కథకులకు గూడ ధర్మార్థ కామ మోక్షములు లభించును. శ్రుతి స్మృతి విజ్ఞానము, శబ్దాను శాసనజ్ఞత, అభిధాన ప్రవీణత, ఛన్దః ప్రభేద వేదిత్వము, అలంకార కౌశలము, రసభావ పరిజ్ఞానము, దేశస్థితిచాతురి, నానాభాషా వైశద్యము, సర్వకాకు విశారదత్వము, కళాశాస్త్ర నైపుణి, తూర్యత్రితయ చాతుర్యము, హృద్య శారీర శాలిత, లయతాల కలాజ్ఞానము, ప్రభూత, ప్రతిభోద్భూతభాక్త్వము, సుభగ గేయత, దేశీరాగాభిజ్ఞత్వము, వాక్పటుత్వము, సభా విజయ సామర్థ్యము, రాగద్వేష పరిత్యాగము, ఉచిజ్ఞత, సార్ద్రత్వము, అనుచ్ఛిష్టోక్తి నిర్బంధము, నూత్నధాతు వినిర్మాణదక్షత, పరచిత్త పరిజ్ఞానము, ప్రబంధ ప్రగల్భత, ద్రుతగీత విరచనా నైపుణి, పద్యాంతర విదగ్ధత, త్రిస్థాన గమనప్రౌఢి, వివిధాలప్తి నిపుణత, విశేషావధానశక్తి, రమ్యరూపము, స్వేచ్ఛా సంచారము, స్వతంత్ర జీవనమును, వాగ్గయకారుఁడగు నుత్తమ కథకుని లక్షణములు.

**సీ॥ ఘనశంఖమో యన గంఠంబు పూరించి మేలుగ శ్రుతిలోన మేళగించి**
**నియమము తప్పక నయఘనంబుల బెక్కు రాగ భేదంబుల రక్తిగొల్పి**
**బంతు లెగిర్చిన పగిది కాలజ్ఞతన్ జాతి మూర్ఛాన లొప్ప స్వరము పాడి**
**చక్కని నృత్యము సర్వ రసానుకూలంబుగాగ నభినయంబు చేసి**
**స్వకృత మృదు యక్షగాన ప్రబంధసరణి**
**వివిధ దేశంబులం బిన్న పెద్దలుగల**
**బలు సభల హరిభక్తి నుపన్యసింప**
**లేని సంగీత కవితాభిమానమేల.**

*(1911 విరోధికృత్ సంవత్సరాది ఆంధ్రపత్రిక సంచికనుండి)*

అనుబంధం - 2 (మొదటిభాగం)

# అజ్జాడ అన్నయ చైనులు గారు

పానుగంటి లక్ష్మీనరసింహారావు

**మా** జిల్లాలో హరిజనులకు సేవజేసిన మహానుభావుడొకడుండెడువాడు. అతడు చేసినసేవ యంతయు బ్రచ్ఛన్నముగ జరిగియుండుటచేత నాతనికి విశేషఖ్యాతి రాలేదు. కాని యాపుణ్యాత్మునింగూర్చి యీ మండలములో మట్టున కెన్నియో చిత్రములైన కథ లిప్పటికి జెప్పుకొనుచున్నారు. ఇట్లు ప్రతి మండలమునకు నొక్కరిద్దఱు హరిజన సేవకులుండిరి. హరిజనసేవాపవిత్రములైన యీదినములలోనే వారి ప్రచ్ఛన్న చరిత్రమును పైకిదీసి యవి ప్రజలకు కుపయోగించునట్లు చేయకపోయిన యెడల దోషముకాదా! కృతఘ్నత కాదా? ఆంధ్రులలో బ్రముఖులేమిచేయవలెననగా మండలమున కిద్దఱు బుద్ధిమంతులను నియమించి పూర్వమున నచ్చటచ్చట హరిజనసేవకు లెవ్వరో వయస్సు మీరిన స్త్రీపురుషులను గనుగొని వారి చరిత్రము లన్నియు పోగుచేయించవలసియున్నది. అవి పరిశీలించి ప్రకటింపవలసియున్నది. వారిలో నెందఱో పవిత్రులు నవతార పురుషులున్నారు. దీనిని మీరు సాక్షిలో బ్రకటింపవలయును.

అనగననగ బ్రాహ్మణుడు. అతడు వేదాధ్యయనసంపన్నుడు, పవిత్ర చరిత్రుడు. అతని భార్య యత్యుత్తమురాలు. భర్తను పరమదైవముగ గొల్చుచుండెను. వారికి బిల్లలు లేరు. ఉన్న భూవసతి వలని రాబడిచేత వారు సర్వజాతుల కన్నప్రదాన మొనర్చుచు భుక్తశేషమును దాముదినుచు సుఖముగ నుండిరి. కాని నిరతాన్నప్రదానము చేత ఋణమెక్కువైనది. దానిని దీర్చుటకై భూములనమ్మివేసినాడు. ఇల్లుమాత్రము మిగిలినది. ఇంకను విరివిగ నన్నప్రదానము చేయుచున్నాడు. ఋణము నెమ్మదిగా దిరుగబెరుగుచున్నది. ఈతని యన్నప్రదానమున కావేళ యీవేళయు లేదు. ఆజాతివాడీజాతివాడను భేదమంతకంటె లేదు. ఎప్పుడెవడువచ్చి యన్నమడిగిన సరే వానికి బెట్టవలసిందే.

ఇట్లుండ నొక్కనాటిరాత్రి నిదురించుట కింక బ్రయత్నపడుచుండగా నేటియావలి నుండి "చైనులుగారూ! అన్నము! అన్నము" అని కేక వినబడెను. ఆ కేకతో నదిరిపడి "ఆ" యని యొక్కకేక వైచెను. ఇంతలో "నేను చండాలుడనని ఈ చుట్టుపక్కల గ్రామాలవారు నాకన్నము పెట్టలేదు. మీరు పెట్టుదురని తెలిసి మీయొద్దకు రాబోవగ నేరడ్డము వచ్చినది"

అని మరింత గట్టికేక వినబడెను. వచ్చుచున్నానని బ్రాహ్మణుడు గొంతెత్తి యఱచెను. రాత్రిభాగము కావున నడుమ నీరున్న కారణమున నేరు విశాలమైనదయ్యును గేకలు సులభముగా వినవచ్చుచుండెను. ఏటికి బూర్తిగా వఱద తగిలినది. నడుము బిత్తెక్కి నురగలతో బ్రవహించుచున్నది. భయంకరముగనున్నది. అది చీకటిరాత్రి. అంతలో బ్రాహ్మణుడు యేటివద్దకు వచ్చినాడు. మోకాలు దిగని యంగవస్త్రము కట్టినాడు. దానిపై మఱియొక్క యంగవస్త్రము నడుమునకు బిగించినాడు. పెరుగునన్నము కలిపియుంచిన కుండ నెత్తిపైనున్న చుట్టకుదిటిపై బెట్టినాడు. కుండపైనున్న మూకుటిలో నావకాయ మొదలగువానిని బెట్టినాడు. దానిపై రెండడ్డాకువిస్తళ్లు పెట్టినాడు. దానిపైనొక్క యంగవస్త్రము వైచి గడ్డము క్రిందికి గావంచయంచులు రానిచ్చి గట్టిగ ముడివైచినాడు. "జయా! పరమేశ్వరా!" యని యేటికడ్డుపడి "నాయనా పంచమసోదరా! వచ్చుచున్నాను. ఒక పావుగంట శాంతింపుము" అని చుట్టుపట్టులనున్న మెట్టలు ప్రతిధ్వనించున ట్లొక్కకేక వైచినాడు.

ఆహా! ఆహాహా! ఈతడు మనుజుడా? దేవతయా? యని గాలి హాహాకా మొనర్చుచున్నది. ఎంత పరోపకారశీలతయో యని చెట్ల మీదిపిట్టలు తత్కీర్తిగానము చేయుచున్నట్లుండెను. ఏటిప్రవాహమొకప్రక్కకు ద్రోచివైచుచున్నను బింకముగ నిల్వుటీత నీదుచు సాధ్యమైనంతవఱ కేటి కడ్డముగ బోవుచున్నాడు. అంతరిక్షమునుండి దేవతలు పుష్పవృష్టి గురియుచున్నయట్లు చినుకులు పరకపాటుగ బడుచున్నవి. ఇంత సాహసమేల చేయవలయునని భార్యయైన జెప్పలేదా? బతిమాలుకొనలేదా? కాళ్లపై బడలేదా? ఏమో! ఎవడెఱుంగును! కాని యామె యింటివద్ద నెంత యేడ్చుచున్నదో! ఆమె యింటి యొద్దనున్నదా? ఏటియొద్ద దైవప్రార్థన మొనర్చుకొనుచు గూరుచుండియున్నదే! పంచమ సోదరుని క్షుద్బాధ శాంతింపజేసి భర్త తిరుగ వచ్చుట సిద్ధించినయెడల నే నాతనితోడనే యింటికి బోవుదును. రాడేని యేగంగతల్లి కడుపున నా భర్త యుండునో అక్కడనే నే నుందునని నిశ్చయపరచుకొనియట గూరుచుండియున్నది. ఆహా! ఏమి యిల్లాలు! దైవప్రార్థన యెట్లు చేసికొనుచున్నదో చెప్పనా! "పరమేశ్వరా! నీవు నా భర్తను రక్షింపుము. నన్ను నా భర్తయే తరింపజేయును. కావున నన్నుగూర్చి ప్రార్థించి నీకు శ్రమమీయను. ఒకవేళ నా భర్త కీ రాత్రితో నాయుఃపరిసమాప్తి నీవు సంకల్పించుకొంటివేని యా పంచమసోదరుని యాకలి శాంతించువఱకైన నా భర్తను సజీవునిగ నుంపుము. ఇంతకంటే నేను మఱేదియు బ్రార్థింపను. నా భర్తతో నేనుందును. గావున నాకు విచారము లేదు."

ఆహాహా! ఇట్టి ప్రార్థన మెచ్చుటనైన వింటిరా! ఆంధ్రసోదరులారా! ఈ దంపతులలో నెవరు యోగ్యతరులో చెప్పగలరా? ఇట్టి వారిని గన్న మా మండల మెంతకృతార్థమో చెప్పవలయునా?

ఆవలిగట్టు చేరి విస్తరిలో నన్నము వడ్డించి యొడిలో నాహరిజనుని బెట్టుకొని యెడమభుజమునకు దాపుకొని యన్నము తినుటకుకూడ హవాలా తప్పిన యాతని నోటిలో రవంత రవంత యన్నము పెట్టి మంచినీరిచ్చి శోషిల్లుచున్న ప్రాణములకు శక్తినిచ్చి బ్రదికించి, పుణ్యము కట్టుకొన్న యాబ్రాహ్మణోత్తముని పేరేదో చెప్పనా? అజ్జాడ అన్నయ చైనులుగారు. అజ్జాడ అన్నయ్య చైనులుగారు. హరిజనప్రపంచమా! ఆంధ్రదేశమా! ఒక్కసారి ధన్యవాద మిమ్ము! చాలదు. మఱియొక్కసారి! ఆంధ్రదేశమా! అతని భార్య పేరు తెలియునా? పాపాత్ముడనైన నాకు దెలియదు. ఎవ్వరైన నెఱిగియుండునెడల సాక్షిద్వారమున దెలియబఱచి సంతసింపజేయుదురా? అజ్జాడ చైనులకు రెండు ధన్యవాదములే యిచ్చిరి. కాని యీనారీ శిరోమణి మూడు ధన్యవాదముల కర్హురాలు.

అనుబంధము - 2 (రెండవభాగము)

# అజ్జాడ అన్నంభొట్లుగారు

### చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

విజయనగరపు సంస్థానంలో అంతఃపురంలోనే అనుకుంటాను. వకగ్రహం కామినీతరగతికి చెందినది పట్టుకొని పీడిస్తూవుందట. ఆ గ్రహాన్ని వదల్చడానికి పెద్ద పెద్ద మంత్రగాళ్లంతా వచ్చారు. కొందరు గ్రహంచేత చెంపకాయలు తినడంకూడా తటస్థించింది. మహారాజావారికి యేమీ తోచడంలేదు. అట్టి స్థితిలో ఆ గ్రహానికే యేమి తోచిందో? "రాజా! యీలా చూడు"మని పిల్చి "యీ మంత్రగాళ్లు నన్ను వదిల్పించలేరు గానీ నీకో వుపాయం చెపుతాను. అలా చేయగలవా?" అందంట. చెప్పవలసిందన్నాడట రాజాగారు. "అయితే విను. శ్రీ అజ్జాడ అన్నంభొట్లుగారు వకరోజురాత్రి రెండు జాములవేళ వక మాలవాడికి చేసిన అన్నదాన ఫలితాన్ని నీవు ధారపోయిస్తే నాకు దానివల్ల మంచి జన్మ వస్తుంది. తద్వారా నాబాధ మీకు తప్పుతుంది" అని చెప్పిందంట. అప్పుడు ఆ ప్రభువు అజ్జాడ అగ్రహారం తమ సంస్థానంలోనిదే కనుక, ఆ అన్నంభొట్లుగారిని సగౌరవంగా

ఆహ్వానించి "అయ్యా తమవల్ల మాకీవుపకారం కావా"లంటూ ప్రార్థించారట. దానిమీద "అయ్యా, నేను నా కర్తవ్యాన్ని నెఱవేర్చుకున్నానేకాని దాన్ని మళ్లా వకరికి విక్రయించే తలంపుతో గాని దానంచేసే తలంపుతోగాని చేయలే"దన్నారట. రాజావారు మిక్కిలిదీనంగా ప్రార్థించారట. దానిమీద యేమీ ప్రతిచెప్పలేక ఆ పుణ్యాన్ని ధారపోశారట. అంతో ఆ బాధ నివర్తించిందట.

తూర్పు కొండయేళ్లు చాలావుంటాయి. అవి వర్షాకాలంలో అంతట్లో ప్రపంచమంతా ముంచేటట్టు పొంగడమున్నూ, మళ్లా వెంటనే కుంగడమున్నూ అందఱూ యెఱిగిందే. అలా పొంగే సమయంలో యేదో వూరినుంచి ఒక మాలవాడు అజ్జాడ మార్గంగా వస్తూ వక తిప్పలో చిక్కుకున్నాడు. క్రమంగా తిప్ప మునిగింది. వీడుకూడా మునిగిపోయే అవస్థ వచ్చింది. రెండు జాములరాత్రి అయింది. అంతా పరుండి నిద్రపోయేవేళ కనక "మొఱ్ఱో చస్తున్నాను. ఆకలికూడా బాధిస్తూంది బాబో" అంటూ గట్టిగా ఆ తిప్పలోంచి అఱచాడు. మేడమీద పరున్న నిరతాన్న ప్రదాత అన్నంభొట్లుగారు విన్నారు. ఆపట్లాన్ని లేచి సుమారు శేరుంబావు బియ్యం అన్నమున్ను అవకాయముక్క వగైరా రసవర్గాలున్నూ మునకాల కఱ్ఱ లావువి రెండు పొగచుట్టలున్నూ అవి కాల్చుకోవడానికి వక యెండుగడ్డితో నిప్పంటించిన లావాటి తూటకట్టానున్ను పట్టుకొని, పాముమీసాన్ని తెగేస్తూవున్న ఆ కొండకాలువను తెప్పమీద అడిచినుకూ పొడిచినుకుగా వున్న వానలో యీదుకొని మళ్లా మాలాడిని ముట్టుకోకుండానే యీవలివొడ్డు చేర్చడానికి తోవాసం యింకో తెప్పకూడా తెప్పకి తగుల్చుకొని తిప్పమీదికి వెళ్లి, సుష్టకృత్తుగా ఉంటే తృప్తాస్థగా వాడికి భోజనంపెట్టి, చుట్టకాల్చుకున్నాక వాడి సహితంగా యీవలివడ్డుకు చేరారట. ఆ మహానుభావుడు యెన్ని వేలమందికో అన్నదానం చేసినప్పటికీ ఆనాటికి హరిజనుడికి చేసిన అన్నదానం ఆ కామినీగ్రహానికి గణనీయం అయింది.

*(కథలు గాథలు మొదటి భాగం - చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి- పు. 30, 31-ఎమెస్కో ప్రచురణ - 2011)*

(చెళ్లపిళ్ల గారు కామినీగ్రహం వదిలించడం విజయనగరం అంతఃపురంలో అంటే, దాసుగారు జయపురంలో అంటున్నారు. నా యెఱుకలో చెప్పిన ప్రకారం ఇది దాసుగారి పుట్టుకకు 30, 40 ఏళ్లక్రితం జరిగివుండాలి. వారి ఇళ్లల్లో చెప్పుకుంటూ ఉండే కథ కాబట్టి జయపురమే సరి అయినది కావచ్చు. చెళ్లపిళ్ల వారు విన్న కథ కాబట్టి కాలక్రమేణా మార్పులు చేరివుండవచ్చు. అజ్జాడ, చుట్టుపక్కల గ్రామాలు జయపురం జమీందారు, విజయనగరం జమీందారు, ఇంగ్లీషువాళ్ల మధ్య రకరకాల సమయాలలో జరిగిన రకరకాల ఒప్పందాలవలన కొన్నాళ్లు ఆ జమీకింద, కొన్నాళ్లు ఈ జమీకింద ఉండేవి. 1850 తరువాత పూర్తిగా విజయనగరం అజమాయిషీ కిందకు వచ్చాయి. దాసుగారు, పానుగంటివారు అన్నయ చైనులు అంటే చెళ్లపిళ్ల వారు అన్నంభొట్లు అంటున్నారు.)

అనుబంధం - 3

# శారదే నారాయణ దాసు

దువ్వూరి వేంకటరమణ శాస్త్రి

నవరాత్రుల్లోనే గాక వట్టప్పుడుకూడా ఏవో కచేరీలు జరుగుతూనే ఉండేవి. అవన్నీ నారాయణదాసు గారి ఆధ్వర్యాన జరుగుతూండేవి. ఆయన్నిబట్టి పైచోట్ల నుంచి గాయకులు ఎంతోమంది వస్తూండేవారు. వచ్చారంటే కచేరీ ఏర్పాటు చేయడమే. వారిని గౌరవించి పంపడమే దాసుగారి పని. అటు నారాయణదాసు గారిదీ అటు రాయదుశాస్త్రులుగారిదీ ఆ రెండూ శారదావతారాలు. మరో విశేషం ఏమిటంటే ఆ యిద్దరూ ప్రాణమిత్రులు. ఒరే అంటే ఒరే అని పిలుపించుకునేవారు. ఆ యిద్దరూ అలా పిలుచుకుంటూంటే వినడం మాకు ఎప్పుడో తటస్థపడేది. ఆ పిలుపు వినేసరికి ఒళ్లు ఝల్లుమనేది. ఆ యిద్దర్ని గూర్చి నాకు తెలిసిన కొద్దిపాటి విశేషాలయినా వివరంగా వ్రాయాలంటే రెండు పుస్తకాలు తయారవుతాయి. విజయనగరాని కొచ్చిన సారస్వత ప్రసిద్ధంతా వారిద్దరివల్లే వచ్చింది. ఆ రెండూ సామాన్యపు దీపాలు కావు. సెర్చిలైట్లు. వారిద్దరూ జ్ఞాపకం వస్తే తక్కిన సంగతులన్నీ మరిచిపోతాం.

రాయదుశాస్త్రులుగారి ప్రతిభా పాండిత్యములను గూర్చి ఆ విజయనగర ప్రసంగం వచ్చినప్పుడు ఆదిభట్ట నారాయణ దాసు మాట జ్ఞాపకం రాకతప్పదు. వారిద్దరూ బాల్యమిత్రులు. రాయదుశాస్త్రులు గారి శాస్త్ర పాండిత్య వైభవానికి అసలు గురువులంటూ ఉన్నారు. నారాయణ దాసుకు గురువులే లేరు. ఆయన ఎవరిదగ్గరా పుస్తకంపట్టి చదివినట్లే కనబడదు. ఆ పాండిత్యమంతా పూర్వజన్మ సంపాదితమే అనిపిస్తుంది. ప్రతిభా సంపదలో ఇద్దరూ సార్వభౌములే.

నారాయణదాసుకు వశమయిన సంస్కృతవాణి ఎట్లాటిదో ఆయన రచించిన సంస్కృత గ్రంథాలే చెపుతాయి. గాన విద్యా ప్రావీణ్యం ఎట్టాటిదో లోకమే చెపుతుంది. శాస్త్రపాండితీ ప్రకర్ష ఎలాటిదో ఒక్కమాటలో సూత్రప్రాయంగా నేను చెపుతాను. దాన్ని బట్టి ఊహించుకోండి.

రాయదుశాస్త్రులుగారు ప్రతిరోజూ సంస్కృత కాలేజీకి నారాయణదాసు గారి వీధులోంచే వెళ్లేవారు. అది కానుకుర్తివారి వీధి. శాస్త్రులుగారు వెళ్లే సమయానికి

అప్పుడప్పుడు నారాయణదాసుగారు తన మేడమీద నుంచి శాస్త్రులు గారి రాక కనిపెట్టి, మేడదిగివచ్చి, శాస్త్రీ! అని కేకవేసి, ఆపి, "చూడు; సిద్ధాంత కౌముదిలోనూ మనోరమలోనూ మహాభాష్యంలోనూ ఈ పంక్తులను సమన్వయం ఇట్లా చేసుకున్నాను. అవునోకాదో చూడు. శంఖంలో పోస్తేగాని తీర్థం కాదుగా!" అనేవాడు. అప్పుడు శాస్త్రులుగారు "అదేనయ్యా సమన్వయం. నీ బుద్ధికి తప్పుదారి తోచదు." అంటూండేవారు. ఇట్లాగే పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారిని పలకరించి "అయ్యా ముక్తావళిలో ఈ పంక్తికి ఇదేకదూ అర్థం" అంటే "అవునండీ" అనవలసిందే గాని అట్టాకాదు ఇట్లాగ అనే అవసరం లేకపోయేది.

ఆ కౌముదన్నా, మనోరమన్నా, మహాభాష్యమన్నా, ముక్తావళన్నా అవి సామాన్య గ్రంథాలు కావు. శాస్త్ర సంస్కారం ఉన్నవాళ్లు గురువు వద్ద సావధానంగా చెప్పుకుంటేగాని బోధపడవలసినవి కావు. నారాయణదాసుకు దేనికీ గురువక్కరలేదు. స్వయం గురుః స్వయం శిష్యః - ప్రతిభా సంపత్తి విషయంలో రాయడు శాస్త్రులుగారి ప్రతిభ గురువుల ఉపదేశం మాత్రం వల్ల ఉద్బుద్ధమయింది. అదీ ఆ రెండు ప్రతిభలకూ ఉన్నతేడా. ఈ యిద్దరికీ ఉన్న ఘనత సులభంగా తెలియజేయాలంటే విజయనగరానికి విద్యానగరమని దేశమంతటా ప్రఖ్యాతి రావడానికి కారణమేమిటని ఆలోచిస్తే విజయరామగజపతీ. ఆనందగజపతీ మహారాజులైయున్న సంస్థానానికి విజయనగరం ప్రధాన పట్టణం కావడం ఒక కారణం. తాతా రాయడుశాస్త్రులుగారూ, ఆదిభట్ట నారాయణదాసుగారూ ఆ పట్టణంలో ఉండడం రెండో కారణం. అదీ వారి ఘనత. ఈ రెండూ అసాధారణ ప్రతిభాజ్యోతులు.

*(కళాప్రపూర్ణ దువ్వూరి వేంకటరమణశాస్త్రి స్వీయ చరిత్ర - పు. 68, 166 - అభినవ ప్రచురణలు - 2009)*



అనుబంధం - 4

# పుంభావ సరస్వతి ఆదిభట్ల నారాయణదాస మహోమనీషి

**డా॥ శంకర శ్రీరామారావు**

**మం**డువేసవి. ఆ ఎస్టేటులో వసంతోత్సవాలు జరుగుతున్నాయి. మా తండ్రిగారు దివాన్జీ ఆ జమీందారీకి. నేనూ వెళ్లి వారి దగ్గర కొంతకాలం గడిపాను స్కూలుకు శలవరోజులు కావటం చేత. ఉత్సవాలలో పాల్గొనుటకు వచ్చిన కవి, పండిత, గాయకులతో వూరంతా కిటకిటలాడిపోతోంది. నాకప్పుడు పదమూడేళ్ల వయస్సు.

ఒకనాడు ఒక కారు వచ్చి మా మేడముందు ఆగింది. నేను మేడమీదనుంచి చూస్తూ నిలబడ్డాను. ఒక విచిత్ర వ్యక్తిని కారులోంచి క్రిందికి దింపుతున్నారు నలుగురు కలిసి. ఎట్టకేలకు ఆ స్థూల శరీరం బయటపడింది. విరబోసిన తెల్లజుట్టు, బానవంటి పెద్ద పొట్ట, సింహ ప్రతిమానమైన ముఖం, కొట్టవచ్చినట్టు కనబడే కళ్లు, బోసినోరు, వాచిన మోకాళ్లు, బ్రహ్మాండమైన చెవులు, ఎనలేని ఠీవి – ఆ శరీరం కొలతలే వేరు. ఆ మనిషి తీరే వేరు. ఆ విగ్రహం కంటపడిందో లేదో ఒక్కసారి "నారాయణ దాసుగారు, నారాయణ దాసుగారు" అన్నమాట అందరి నోళ్లనుండి వినపడింది. ఈయనేనా హరికథ చెప్పే నారాయణ దాసుగారు! నా కళ్లను నేను నమ్మలేకపోయాను.

మా నాన్నగారికి ప్రియమిత్రులు నారాయణ దాసుగారు. పంతులుగారూ అని వారూ, దాసుగారూ అని వీరూ పిలుచుకుంటూ వుంటే ఏదో రసవంతమైన ఆప్యాయత వారిద్దరి మధ్య ఆనంద నృత్యం చేస్తున్నట్లు తోచేది. ఎన్నెన్నో విషయాలు చెప్పుకునేవారు. అందులో సంగీతం, సాహిత్యం, శిల్పం, నృత్యం ఒకటేమిటి విశ్వమంతా విరివాన కురిసినట్లే! నేను నోరు తెరుచుకొని వినేవాణ్ణి. కళ్లప్పగించి చూసేవాణ్ణి. నిండు గుండెతో నవ్వేవాణ్ణి. నా హృదయం ఆనందంతో నిండిపోయేది. ఏమిటీ మనిషి!

దాసుగారి స్నానం ఒక బాలింత పురిటినీళ్లకంటే విస్తృతంగా ఉండేది. నలుగురు నౌకర్లు కాళ్లకూ, చేతులకు నూనె మర్దనా చేయడం, ఒకడు ప్రత్యేకం తలకు ఒళ్లంతా నలుగుపెట్టడం, తల రుద్దటం. ఇదంతా రెండు గంటల తతంగం. అర్ధనిమీలితంగా ఏదో పరవశత్వంలో మునిగినట్టుండి మధ్య మధ్య ఏవో ఛలోక్తులు విసిరి నవ్వించేవారు దాసుగారు. వారి మాటల్లోని విశాఖపట్నం యాస వారి చమత్కారానికి మరింత సాన పెట్టినట్టుండేది.

స్నానం ముగిసింది. "బాబూ, నీ దగ్గర హెయిర్ ఆయిల్ ఏమైనా ఉందా?" అని అడిగారు నన్ను. "Lime juice glycerine" ఒక నిండు సీసా విప్పి అందించాను. అద్దం ముందు కూర్చుని టాయిలెట్ ప్రారంభించారు. నూనె రాయడం, జుట్టు దువ్వడం, రకరకాలుగా వంకలు త్రిప్పడం, ఒక విధంగా ముడివేయడం, ఒక గంటసేపటికి అరణ్యం వంటి ఆ జుట్టు తరంగాలతో మిలమిలలాడే సెలయేరులా రూపొందింది. ఆ తరువాత మీసాలు మెలిపెట్టి నూనె రాసి, కొనలు తేల్చి, ఓరగా అద్దంలో చూసుకున్నారు. కొప్పులో

పూలదండ, చేతులకు కడియాలు, వక్షస్థలానికి మెడల్సుతో కట్టిన గొలుసు, కాలికి బంగారు కంకణం.

ఇక వస్త్రాలంకరణ. అది ఒక యజ్ఞం. ఇద్దరు మనుషులు ఆ స్థూలదేహం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ చలవచేసిన సేలమంచు పట్టుబట్ట బిగించి కట్టారు. నడుముకు కాసెకోక బిగించారు. సరిగంచుల ఉత్తరీయం వల్లెవాటుగా వేశారు.

వేషం పూర్తయింది. నిలువుటద్దంలో ఆ పుంభావ సరస్వతి తన ప్రతిబింబం చూచుకొని చిరునవ్వులు చిందించి మురిసిపోయాడు. ఆ స్థౌల్యం ఏమయిందో, ఆ వార్థక్యం ఏమయిందో! నవయౌవనమూర్తి సాక్షాత్కరించింది.

ఇక హరికథ. అది ఒక మరుపురాని మాధుర్యం. సకల కళలు వచ్చి చేరిన ఒక సుధాసాగరం. "శంభో" అన్న ఆ మేఘగంభీరస్వరం ఇంకా నా చెవుల్లో మారుమ్రోగినట్లే ఉంటుంది. "తేజవ్వనంబూ పసందు" అని రసావేశంతో రకరకాలుగా నృత్యంచేస్తే ఆ నాయిక వారి ముఖంలో కనిపించేది. మధ్యలో ఆపి ఏ వేదాంత విషయమో మొదలు పెడితే ఆనాటికి దాంతోనే ముగిసేది కథ. ఇక గానమో! అదొక కొండవాగు. అమృతవాహిని. దాసుగారి దగ్గ కూడా లయబద్ధము. శ్రుతి పక్వము. అన్ని కళలు కరతలామలకాలు దాసుగారికి. వారి ప్రతిభ అనన్య సామాన్యం. ఆయన కవి, పండితుడు, నటుడు, గాయకుడు, సకల కళాకోవిదుడు, అంతటి ఆత్మవిశ్వాసం ఇంకెక్కడా కానరాదు. ఆ ఠీవి! రాజాధిరాజులలో కూడా మనం చూడము.

ఇంటికి వచ్చి స్నానం, భోజనం ముగించుకుని విశాలమైన పేము పడక కుర్చీలో ఆసీనులయ్యారు. "ఆ మూల ఆ గంపేమిట్రా అబ్బీ!" అన్నారు బంట్రోతును. "అవి మల్లెపూలు సామీ, దివాణంలోంచి పంపించారు" అన్నాడు వాడు. "నా పక్కమీద పోసెయ్యరా, మరేమిటి?" అన్నారు దాసుగారు యాసగా, ఆ గంపెడు మల్లెపూలు ఆ శరీరం క్రింద నలిగి తమ పరిమళాన్ని ఆ కళామూర్తికి చిక్కగా పట్టించి మురిసిపోయాయి.

ఆ వారం రోజులు మా మేడలో మకాం దాసుగారు. రోజూ గానసభలు, నాటకాలు, మేజువాణీలు, కవితా గోష్ఠులు, ఇమిటేషన్ ఆచార్లుగారి హాస్య విన్యాసాలు, సంగమేశ్వరశాస్త్రి గారి మధుర మంజుల వీణావాదన, జంగం కోటయ్యదేవరగారి కుమార్ల ఫ్లూటు, వయొలిన్ వాద్యాలు, ఒకటేమిటి అంతా రసమయం, ఆనందమయం, కళామయం.

ఒకసారి కథ జరుగుతోంది. దాసుగారు నోటితో అన్న సంగతి హార్మోనియం మీద కమ్మగా అన్నాడు పార్వతీశం. "ఓరీ వెధవా! ఏదీ మళ్లీ అను" అన్నాడు దాసుగారు అటు తిరిగి. పొంగిపోయాడు అతగాడు. సహజవాత్సల్య భరితమైన ఆ ప్రశంస వెయ్యి సన్మానాల పెట్టు. ఎప్పుడూ అందరికీ చెబుతూ ఉండేవాడు పార్వతీశం ఈ సంగతి సగర్వంగా. ఆ విధమైన సహజవాత్సల్యమే వారి శిష్యపరంపరను ఒక పెద్ద కుటుంబంగా పెంచి ఆంధ్రదేశమంతా నింపింది.

(నాట్యకళ - ఆదిభట్ట నారాయణ దాసు ప్రత్యేక సంచిక - ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ - ఫిబ్రవరి 1965)

# మిత్రమండలికి మిత్రులు



పులి ఓబుల్ రెడ్డి
నివాసం గుంటూరు
చేసేది వ్యాపారం





ఎలిచర్ల శివానందలహరి రెడ్డి
సాఫ్ట్‌వేర్ ఇంజనీర్
బెంగళూరు





శెట్లెం చంద్రమోహన్
ప్రిన్సిపల్, రెడ్డి బి.ఎడ్ కళాశాల,
గుంటూరు.



మిత్రత్వం, చేతనైన సాయం చేయగలగటం, పుస్తకాభిమానం, ఆంధ్రత్వం అంటే ఆదరణ, చెరగని చిరునవ్వు, ప్రియభాషణ, పాతకొత్తలలో మంచిని వెదికి ఆస్వాదించగలగడం, హడావిడి లేని దూకుడు పై ముగ్గురి ఉమ్మడి లక్షణాలు. పంచతంత్రంలోని మొదటిదానిని వీరు మిత్రమండలి ప్రచురణలకి చవిచూపారు.



ఎవరీ ముగ్ధమనోజ్ఞ దర్శను! డెవండీ శారదామూర్తి! యీ
నవ శృంగార రసావతారుడెవరన్నా! శ్రీ మదజ్జాడయే
యవునా! ఆ దరహాస! మానడకతీ! రాశీవి! యాదర్ప! మా
కవితాదీప్తి! యనన్య సాధ్యములురా! కైమోడ్పు లందింపరా!

- కరుణశ్రీ

శ్రీ ఆదిభట్ల నారాయణదాసు గారు (31-8-1864 :: 2-1-1945) నవరస విలసితమైన నవకళాప్రక్రియ హరికథకు ఆద్యులు. 1914లో శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి అధ్యక్షతన విద్వద్వరులు "హరికథా పితామహ" అన్నారు. 1928లో మద్రాసు విద్వాంసులు "ఆంధ్రదేశ భూషణము" అని ఏకగ్రీవంగా పలికారు. 1933లో జయపురం సంస్థానాధీశులు విక్రమదేవవర్మ "సంగీత సాహిత్య సార్వభౌమ", 1935లో భారతీతీర్థవిద్యాలయం "ఆటపాటలమేటి" బిరుదులతో సత్కరించారు.

ఈ గ్రంథం ఆ మహామనీషి, శారదావతారం దాసుగారి స్వీయచరిత్ర

**'నా యెఱుక'.**

**- మిత్రమండలి ప్రచురణలు, గుంటూరు.**